







# వేదములు

## విచారణ

# పురాణోక్త వైశ్యా పరచంద్రిక







## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035283

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

D L I

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం పరబ్రహ్మణేనమః.

పూర్వమీమాంస, అపరకృష్ణీయ, నిర్ణయసింధు, ప్రయోగ
కమలాకర, జ్యోతిశ్శాస్త్ర, ధర్మశాస్త్ర,
పురాణాదులనుండి సంగృహీతంబైన

# పురాణోక్తాపరకర్మప్రకాశికయను

# వైశ్యాపరచంద్రిక

ఈ గ్రంథము

కీ॥ శే॥ నా తండ్రిగారైన

చల్లా లక్ష్మీనృసింహశాస్త్రిగారిచే

ఆంధ్ర తాత్పర్య సహితముగా వ్రాయఁబడి,

వారి జ్యేష్ఠ పుత్రుఁడు

సుబ్బరాయశాస్త్రిచే

స్వకీయ

శ్రీ లక్ష్మీనరసింహ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియె

మచిలీపట్టణము.

దశమ ముద్రణము 600 ప్రతులు.

1962

 [వెల రు. 3-0-0

ఆదౌ నూతనవస్త్రాణి ధారయేత్.

శ్లో॥ నాగోభాతి మదేనఖం జలధరైః పూర్ణేందు నాశర్వరీ । శీలేన ప్రమదాజలం జలరుహైః ర్నితోత్సవః పండితైః । సత్పుత్రేణ కులంతి త్వాసూ వసుమతీ లోకత్రయం భానునా ॥ దేవస్య గృహే మునయో వసంతి దేవానాంగవయః పార్థివాసః దేవా ఇదంమే సుమనస్యమానౌ దివి దేవా వసవో దీర్ఘమాయుః ॥

---



లక్ష్మీనృసింహా ప్రెస్,
బందరు, బచ్చుపేట.

ఇట్లు.
చల్లా సుబ్బరాయశాస్త్రి

# పీఠిక.

సుజనవర్యులారా !

జననీ జనకులు మృతినొందిన సమయమందు పుత్రులు ప్రేత కర్మములను జక్కఁగనియమయుతముగ నెఱవేర్చ లేని వారు (ఆ జననీ జనకులు తమ పుత్రాదులొనరించిన దానాది కర్మములకు విధింపఁ బడిన పుణ్యలోకములను బొందుదురు. మఱియు వారు పితృ దేవ త్వముగలవారగుదురు. వారట్లగుటచే వారానందమునుబొంది తమ పుత్రులు దీర్ఘాయుష్మంతులును, తేజోవంతులును, ధనవంతులును అగునట్లు ఆశీర్వచనములను జేయుదురు ఆ యాశీర్వచన సామ ర్థ్యంబు వలన పుత్రులు సుఖవంతులై యుందురు.

శ్లో॥ పితౄణాంచ ప్రసాదేన కర్తృ ర్వంశోభివర్ధతే । శ్రేయ సాంచాభి వృద్ధిస్స్యా ద్భూయసా ముత్తరోత్తరమ్ ॥

తా॥ పితృదేవతలయొక్క యనుగ్రహముచేతఁ బుత్త్రాదుల యొక్క వంశ మభివృద్ధిని బొందుటయేగాక గొప్పవగు శ్రేయస్సులు గూడ విశేషించి కలుగును.

ఔర్ధ్వ దైహిక కర్మమునకు పైతృమేధికమని పేరు. పైతృ మేధికమనఁగా చనిపోయిన మాతాపితృ మాతామహాది కారుణ్యవర్గ ములోని వారలకు దహనసంస్కారము మొదలుకొని సపిండీకరణాం తము వఱకునుజేయు కర్మయని యభిప్రాయము.

"జ్ఞాత్వా కర్మాణికుర్వీత" అని యుండెను కాఁబట్టి కాలము తెలిసి పుత్త్రులు కర్మమాచరింపఁదగును. ఈ కలికాలమహిమవలన కొందరు పుత్త్రులు మాతాపితరులను సదాదూషింపుచు వారు మృతు లైనంవెనుక వారికి సకాలమందు శ్రాద్ధములఁజేయక మా తల్లిదండ్రులు తినవచ్చినారా ? పురోహితులకొఱకీ శ్రాద్ధము లేర్పడిన వనెడు ముఖ్యాభిప్రాయము గలవారగుదురు.

శ్లో॥ పున్నామ్నో నరకాద్యస్మా త్పితరం త్రాయతేసుతః । తస్మాత్పుత్ర ఇతిప్రోక్త స్స్వయమేవ స్వయంభువా ॥ అనఁగా ఏకార ణామువలన పున్నామయను నరకమునుండి తండ్రిని రక్షింపుచున్నాఁ డో ఆకారణమువలన పుత్త్రుఁని స్వయముగా బ్రహ్మచే జెప్పఁబడెను.

శ్లో॥ జీవతో ర్వాక్యకరణా త్ప్రత్యబ్దం భూరి భోజనాత్ ।
గయాయాం పిండదానాశ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా ॥

అనఁగా తల్లిదండ్రుల యాజ్ఞ ననుసరించుటయుఁ బ్రత్యాబ్దిక శ్రాద్ధము అమశ్రాద్ధవిధిచే జఱిపి పిమ్మట తమ తమ బంధువుల కన్న దానముచేయుటయు, గయయందు పిండప్రదానము చేయుట యును ఈ మూఁడుకార్యము లాచరించుటచే పుత్రుఁడు పుత్రధర్మ మును నెఱవేర్చినవాఁడగును.

అయ్యా, ప్రాచీన గ్రంథములయందపరము పురాణోక్తవిధిగా నొకచోట వ్రాయనందున ధర్మశాస్త్రములయందుఁ బ్రవీణత గల యాజ్ఞికులకుఁదప్ప తక్కిన సామాన్య జనులకు దానిఁజూచి గ్రహించు టకు కఠినముగనుండెను. మఱియు నీమంత్రముఁజెప్పి యీ క్రియఁ జేయవలయునని యెల్లరకుఁ దెలియకయు, మధ్య ధర్మశాస్త్రముండు టచేఁ బ్రయోగమును వఱుసగా గ్రహించుటకుఁ దెలియకయున్నది. పెక్కు దేశములయందు ధర్మశాస్త్రరీతిగ జఱుపు బ్రాహ్మణులు పడు చుండిన శ్రమ మింతయని చెప్పనలవిగాదు. ఈ పురాణోక్త ప్ర యోగములను కొందఱు కొంతకాలమువఱకుఁ జదివియు కొన్ని ప్ర యోగాదులయందు సందేహముగలవారై యీవిద్యదురవగాహంబని ప్రారంభింపకయేయున్నారు. బుద్ధిమంతులు మఱికొందఱు ధర్మ శాస్త్ర గ్రంథములనే మిగుల కష్టముతో చిరకాలము పఠించి అందు జ్ఞానముగలిగిన పిమ్మటఁ బ్రయోగములను దెలిసికొను చున్నారు. బహుజనులిట్లు శ్రమపడుటఁజూచి ఈగ్రంథము ముద్రింపఁజడినది. వీని లో పురుషపరంపరగా జఱుపునప్పుడు పితుః ... గోత్రస్య ... ప్రేతస్య యనియును, స్త్రీవాచకమునందు మాతుర్గోత్రాయాః ... ప్రేతాయాః యనియును జఱుపఁదగును. ప్రయోగాదులలో ... గ్రహించదగును. దీనియందెచ్చటైనను స్ఖలిత్యములుండిన పక్షమందు వానిని వివరము గా వ్రాసి మాకుఁబంపించినపక్షమందు రాబోవుకూర్పులో సవరించె దను. కాఁబట్టి బుధోత్తములను బ్రార్థించెదను. చ॥ సు॥

# గ్రంథస్థవిషయములు.

గ్రంథస్థ విషయములు సమాప్తమ్

# పురాణోక్త వైశ్య అపరచంద్రిక.

మృతికి దోషనక్షత్రములు.

నిర్ణయామృతే ॥శ్లో॥ రోహిణ్యాం వసుపంచకే త్రిపదభే యుగ్మాంఘ్రి జైపైతృభే । నందాకామ చతుర్దశీ భృగుకుజార్కేష్వేషుభ దేతిథౌ । ప్రేతశ్రాద్ధమృతీ సపిండకరణ త్రైపక్షి కౌనత్రయా ॥ శ్చేద్వంశక్షయ మాప్నువంతి కురుతేమాస ద్విపహాద్వయే॥

తా॥ రోహిణి, ధనిష్ట, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, త్రిపాదినక్షత్రములగు కృత్తిక, పునర్వసు, ఉత్తరవిశాఖ ఉషా,లును ద్విపాదినక్షత్రములైన మృగశీర్ష చిత్రనక్షత్రములును, మఘ, ఈనక్షత్రములయందును ప్రేతకర్మము, మరణము, సపిండీకరణము, త్రైపక్షితము, ఊనమాసికములు, మొదలుగాగల ప్రేతకార్యములు చేయగూడదు, అనఁగా దోషముగల నక్షత్రములని భావము.

దోషయుక్త తిథివారములు.

పాడ్యమి- విదియ- షష్టి- సప్తమి- ఏకాదశి- ద్వాదశి- త్రయోదశి- చతుర్దశి- ఈతిథులు దోషములుగలవి, వారములు శుక్ర- కుజ- భానువారములు- దోషములుగలవి. శనివారము మాత్రము మధ్యమపక్షమని కొందరుచెప్పిరి.

మంచి నక్షత్రములు.

శ్లో॥ మృతతిథిషు యదాస్యాత్సోనుసౌమార్యవారాః । ఇతి శుభఫలదాని ప్రోచ్యతే ధర్మవిద్భిః తురగభరణిపుష్య స్వాతిహస్తార్ద్రమిత్రే ॥ శ్రవణజలసమేతాః జ్యేష్ఠమూలాస్తథైవ । భుజగమపిచ పూర్వాఫల్గునీనామధేయమ్ సకలమునుగణానాంశస్యతే ప్రేతకార్యే ॥

తా॥ అశ్విని- భరణి- ఆర్ద్ర- పుష్యమి- ఆశ్రేష- పుబ్బ- హస్త- స్వాతి- అనూరాధ- జ్యేష్ఠ- మూల- పూర్వాషాఢ- శ్రవణము ఈనక్షత్రములు ప్రేతకార్యములకు మంచివి, వారములలో సోమ బుధ- గురువారములుప్రశస్తములు.

శ్లో॥ ప్రాచీనగ్రంథే మృతేతుదదహనేచైవ ప్రేతధిష్ణ్యప్రవేశనే। పుణ్యక్షేత్రేపుణ్యదిథౌ పుణ్యతీర్థేఽస్థినిక్షేపే। యుగ్మాఘిత్రిపదభేరోహిణ్యాం పైతృభేతథా। ధనిష్ఠాపంచకేచాపి ప్రేతకార్యం నకారయేత్ ॥

తా॥ మృతతిథియందును ,దహనమందును, ప్రేతయొక్క-గృహమందు ప్రవేశించుటయందును, పుణ్యతీర్థములు సేవించుటయందును, అస్థినిక్షేపణమందును, ద్విపాది- త్రిపాది- రోహిణి- మఘా నక్షత్రములయందుసు, ధనిష్ఠాపంచకమందును పేతకర్మము చేయకూడదు.

శ్లో॥ గ్రంథాంతరే నందాభద్రా కామభూత। భౌమశుక్రార్క వాసరాః దహనేమరణేచైవ। తద్దోషంత్రిగుణంభవేత్ ॥

తా॥ ౧౨-౬-౭-౧౧-౧౨-౧౩-౧౪ ఈతిధులయందును రవి- శుక్ర- కుజవారములయందును ధహనమరణములు జరిగెనేని ఆమరణమొందిన స్థలమందు మరణమును, దహనముజరిగిన స్థలమునందు దహనమును మూడుపర్యాయములు జరుగును

శ్లో॥ కింతిథ్యుడుయోగేగ్రామే వారోడ్యోగే వాటికాయమ్ తిధివారోడ్యోగె గేహేమరణం పునర్భవతి ॥

తా॥ పైనజెప్పిన దోషతిధులు నక్షత్రములుగూడగా మరణము నొందనేని యాగ్రామములో తిరిగి మరణము జరుగుననియును నక్షత్ర వారములు కూడెనేని వాటికయందుతిరిగి దహనము జరుగుననియును, తిథివారనక్షత్రములు గూడెయుండెనేని మరణమొందిన గృహమందు తిరిగి మరణము జరుపవలెను.

శ్లో॥ మాసనిర్ణయః ద్విబాదేత్రిణిమాసాని త్రిపాదేచ చతుష్టయమ్॥ తద్గృహంవర్జయేద్ధీమాన్ షాణ్మాసం వసుపంచకే ॥

తా॥ ద్విపాదనక్షత్రములగు మృ- చి- ధ- ఈనక్షత్రముల యందు మరణమునొందెనేని మూడుమాసములవరకును త్రిపాదినక్షత్రములగు కృ- పున- ఉఫ- విశా- ఉత్తరాషాఢ ఈనక్షత్రముల

యందు నాలుగుమాసములవరకును ధ- శత- పూభా- ఉభా- రే- ఈనక్షత్రములయందు మరణమునొందెనేని ఆరుమాసములవరకును ఏగృహమునందు మరణముకలుగునో ఆగృహము విడువవలెను.

## మృతి చక్రము

కృ ఆశ్లేష మ
రో పుష్య పూఫ
మృ పున ఉఫ
అర్ద్ర

శ్లో॥ సూర్యాధిష్ఠితతారాకాది గణయేచ్చత్వారి బాహ్యాంతరే బాహ్యేత్రీణి పునఃపునశ్చగణయే దీశాన్యదిక్షుక్రమాత్ ॥

తా॥ మృతిదినమున సూర్యుడే నక్షత్రమునందుండునో అది మొదలు ఈశాన్యదిక్కునుంచి చక్రమధ్యమువరకు ౪ నక్షత్రములును తదుపరి నక్షత్రమును మొదలుకొని క్రమముగా లిఖించవలెను. చక్ర మధ్యస్థితనక్షత్రము మొదలు తూర్పువరకు ౪ నక్షత్రములును క్రమ

ముగా ఆగ్నేయము మొదలు చక్రమధ్యమువరకు ర నక్షత్రములును ఈప్రకారమే ఈశాన్యదిక్కునుంచి ప్రాగాదిదా విదిక్కులయందు 3 ను దిక్కులయందు ర ను ఆరోహణ అవరోహణ క్రమముగా వ్రాసి చూడవలెను.

శ్లో॥ మృతికాలేందునక్షత్రం యత్రతిష్ఠతి తత్రకమాత్ ।
అంతరంగే త్రిపక్షస్స్యా న్మధ్యకేత్వ్యే ద్విపక్షకమ్ ।
అంత్యేచపక్షమేకంస్స్యా ద్బాహ్యేరేఖానదోషభాక్ ॥

తా॥ మరణకాల నక్షత్రము చక్రమధ్యమందుంటే అగ్రహా ము ర౨ రోజులు విడువవలెను. దానికిచుట్టువున్న ౮ గదులలో వుంటే ౧ మాసము విడువవలెను. దానికిచుట్టువున్న పరిహారీలోపల యుంటే ౧౨ రోజులు విడువవలెను. చక్రమునకు వెలుపలనుంటే ఆయింటివారికి దోషములేదు గాని ఆయాదిక్కులయందున్న వారికి దోషముసంభవించును.

ఇతి మృతిచక్ర నక్షత్రవిచార స్సమాప్తః

అథమాతా పితృభక్తి.

---

లోకమునందును జంతుజాలములోనంతయు మానవజన్మముత్త మము. అదిజన్మాంతర సుకృతపరిపాక విశేషముచేత గలుగవలసినదే కాని మరియొకదానివలన గలుగునదికాదు. అట్టిదుర్లభమైన జన్మము లభించియు మాతాపితృభక్తిజ్ఞాన మనునవి పట్టుపడకపోయిన ఈజన్మ ము వ్యర్థమైపోవును, కాబట్టి మనుష్యులలో నెవ్వనికిగాని వానివాని తల్లిదండ్రులు జగజ్జననీ జనకస్వరూపులై యుందురు. ఇట్టితల్లిదం డ్రులయెడభక్తి జేయుటప్రథమకర్తవ్యమని తద్విషయకమైనప్రమాణం

శ్లో॥ నాస్తిమాతృసమందైవం నాస్తిపితృసమోగురుః ।
తయోఃప్రత్యుపకారోపి నకథంచ నవిద్యతే ॥

తా॥ తల్లితోసమానమైనదైవములేదు- తండ్రితోసమానమైన గురుఁడులేఁడు, ఎందువలననగా ఆతల్లిదండ్రులకు వారుకనిపెంచి కాపాడుచువచ్చిన ఉపకారమునకై ప్రత్యుపకారమును యోచించితే యెవ్విధమునను కానరాదు. కావునకృతజ్ఞులమై ఉండవలెను.

శ్లో॥ మాతాపితాచసుప్రీతౌ స్యాతాంపుత్రగుణైర్యది స్సపుత్రస్సకలంధర్మం ప్రాప్నుయాత్తేన కర్మణా ॥

తా॥ తల్లిదండ్రుల నానందపరచుటయే సర్వసుకృతమనం బడును. అదిలేక యెన్నిపుణ్యములను జేసినను వ్యర్థమనిభావము.

## పుత్త్రిస్వరూపము

శ్లో॥ పున్నామ్నోనరకాద్యస్మాత్త్పితరంత్రాయతేసుతః ।
తస్మాత్పుత్రఇతిప్రోక్తస్స్వయమేవ స్వయంభువా ॥

టీక॥ యస్మాత్= ఎందువల, పున్నామః= పుత్రుఅనుపేరుగల, నరకాత్ దుఃఖానుభవంబునుండి పితరం= తండ్రిని, సుతః= కొడుకు, త్రాయతే= కాపాడుచున్నాఁడో, తస్మాత్= అందువలన, స్వయంభువా= స్వయముగా, పుట్టినబ్రహ్మచేత, స్వయమేవ= తాను గానే, పుత్రః ఇతి=. పుత్రుడని ప్రోక్తః= అకొడుకుచెప్పబడుచున్నాడు అనగా పుత్రుడుపుట్టుటచే తండ్రికి సద్గతినిచ్చుచున్నాను. వీడుపుట్టుటచేత తండ్రియొక్క నరకదుఃఖము నివర్తించును. ధర్మమును ప్రజాసంతతి పరంపరమ తనతోపోనియ్యక పెంచినదగుటయే తండ్రికిదుఃఖనివృత్తి.

శ్లో॥ అజామృతచమూర్ఖాణాం మృతాజాతౌ వరౌసుతౌ ।
తౌకించిచ్ఛోకదౌపిత్రోర్మూర్ఖస్త్వత్యంతశోకదః ॥

టీ॥ మూడువిధములు సంతానములు- పుట్టనివి- పుట్టిచచ్చినవి, పుట్టిమూర్ఖంబులయినవి, (అట్టి)అజాత= పుట్టనివాడు, మృత= చచ్చినవాడు మూర్ఖాణాం= మూర్ఖుఁడనెడుముగ్గురిలో, మృత= అజాతౌ, చచ్చినవాడు, పుట్టనివాడనెడు ఇద్దరును, వరౌసుతౌ= శ్రేష్ఠులైనకొడుకులు, ఎందువల్లననిన, తౌ= వారలు, పిత్రోః తల్లిదండ్రులకు, కించిత్= శోకదౌ, కొంచముగా తలచినప్పుడొకప్పుడు మాత్రమేదుఃఖమునిచ్చువారలు, మూర్ఖః= తు, మూఢుడైనకొడుకైతే, అత్యంతశోకదః మిక్కిలి దుఃఖకరుడుగా నుండును, అనగాకొడుకుమూర్ఖుడయ్యేనని తల్లిదండ్రులు ఎప్పుడును దుఃఖించుచుందురనుట.

శ్లో॥ జీవతో ర్వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరిభోజనాత్ ।
గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా ॥

టీ॥ జీవతః= బ్రతికియున్న తల్లిదండ్రులయొక్క, వాక్యకరణాత్= మాట నెరవేర్చుటచేతను, ప్రత్యబ్దం= తల్లిదండ్రులు చనిపోయిన వెనుక ప్రతిసంవత్సరమునందును, భూరిభోజనాత్= విస్తారముగా శ్రాద్ధభోజనంబుల నిడుటచేతను, గయాయాం= గయాక్షేత్రమునందు, పిండదానాత్ చ= విష్ణుపదీశ్రాద్ధము చేయుటచేతను, త్రిభిః= ఈమూడింటిచేతనే, పుత్రస్య= కొడుకునకు, పుత్రతా= పుత్రత్వము అనగా తండ్రిచెప్పినట్లు వినుచుండి పిదపకృతజ్ఞతతో పితృధర్మమును పాలించువాడు గనుక పుత్రుడనంబడును.

శ్లో॥ ప్రజయాంచ పితౄన్ పూర్వా ననృణో దివి మోదతే ।
పుత్రేణ లోకాన్ జయతి పౌత్రేణానందమశ్నుతే ।
అథ పుత్రస్య పౌత్రేణ నాక మేవాధిరోహతి ।
అనోగృహీ యో భవతి పుత్రస్తస్యహి పుత్రతా ॥

టీ॥ అనృణః= గృహస్థుడై పితృఋణవిముక్తినందినవాడు, ప్రజాయా= సంతానముచేత, పూర్వాన్ పితౄన్= పితృపితామహ ప్రపితామహులగు తనకును కలిగినవారలగు పితృగణంబును, పుత్రోత్పాదనరూప ధర్మాచరణముచే సంతుష్టులంజేసి దివి= తేజోలోకమునందు, మోదతే= సంతసించును, మరియు పుత్రేణ= ధర్మముగాగలిగిన కొడుకుచే లోకాన్= ఐహికజనులను, జయతి= జయించుచున్నాడనగా వీనిచే నారంభింపబడిన కార్యములను కొనసాగించువాడుగను తనయుధర్మార్థిపూర్ణాదులను నిర్వహించుకొనువాడు గనుక యుండునట్టివాడు; కొడుకుగనుక లోకులతోందరి తనకులేకపోవుటయే జయమనవచ్చును. అటుగాకపోయిన లోకాన్ పారత్రికలోకంబులను జయించుననగా నాపుత్రునిచే నియ్యబడు తిలోదకాదులచే పుణ్యలోకంబులనొందునని భావము. పౌత్రేణ= మనుమనిచే, ఆనందమశ్నుతే= సుఖమనుభవించుననగా నావంశమిట్లభివృద్ధినొందెగదా నేను పితృఋణవిముక్తికొరకు పుత్రునింగనెనని యానందించును అథ= అటుపిమ్మట, పుత్రస్య పౌత్రేణ= కొడుకుయొక్క మనుమనిచే, నాకం— ఏవ= బ్రహ్మలోకమునే, అధిరోహతి= యెక్కుననగా నతనిపుణ్యం బపారంబని భావము, అతః= అందువలన, యః పుత్రః= ఏపుత్రుడు, గృహీ భవతి= సంసారిగా నేర్పడునో, తస్య= అట్టివానికే, పుత్రతా హి= పుత్రత్వము గలుగునుగదా, ఎవ్వడుకాని అట్టివానికొడు

కని పేరువాండి ధర్మమునవలంభించి సంసారియనంబడి పరోపకారనిరతుండైయుం డునో వాడు కొడుకుగాని ఎవ్వడో పీడొకయనామధేయుడు అబ్బాయను పేరుచే వాడనిపించు మూఢుడు కొడుకుగాడనిరి

## దానస్వరూపము

దానములు మూడువిధములు- సాత్వికము, రాజసము, తామసము.

శ్లో॥ దాతవ్యమిదియద్దానం దీయతేనుపకారిణే ।
దేశకాలేచ పాత్రేచ తద్దానం సాత్వికంస్మృతమ్ ॥

తా॥ అనఁగా దానమియ్యదగినదని తలచి తనకుపకార మును జేయనివానికే యుక్తదేశమచదును యుక్తకాలమునుతగిన పాత్రమునవ్వబడుచున్నదో ఆదానము స్వాత్విక దానమని చెప్పిరి.

శ్లో॥ యత్తుప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్యవాపునః ।
దీయతేచపరిక్లిష్టం తద్దానంరాజసంస్మృతమ్ ॥

తా॥ ఏదిప్రత్యుపకారముకొరకుగాని ప్రతిఫలముకొరకుగాని వ్యసనముతో నియ్యబడుచున్నదో అదిరాజసదానమని చెప్పబడును.

శ్లో॥ అదేశకాలే యుద్దానం అపాత్రేభ్యశ్చదీయతే ।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥

తా॥ ఏదానము అదేశమందును అకాలమందును, అపాత్రము లందును, ఆమర్యాదతో తెలియక యియ్యబడుచున్నదో ఆదానము తామసదానమని భగవద్గీతా ప్రమాణముకలదు. ఈమూడువిధము లైన దానములలో మొదటిదైన సాత్వికదానము శ్రేష్ఠమైనదనియు, ఆవిధముగ జేయుటచే విగుల పుణ్యము లభించుననియును, ఆరీతిని చేయుటచే పుణ్యములభించదనియు, మూడవదగు తామసదానము నిందింపదగినదనియు, ఆవిధముగ దానముచేయుటచే పాపమేతప్పక లభించుననియు అనేకప్రమాణములుగలవు.

శ్లో॥ కింతస్యస్నానైః కింతీర్థైః కింతపోభిః కిమధ్వరైః ।
హృదిస్థోయస్య భగవాన్మంగళాయతనోహరిః ॥

తా॥ మనమున నీశ్వరధ్యానమిష్టలేక బయటడాంబికుడై ఎన్ని దానములుచేసినను వ్యర్థము, ఎన్నితీర్థములు సేవించినను ఫలములేదు ఎన్నితపంబులుసలిపినను లాభములేదు. యెన్నియజ్ఞముల నాచరించినను నిష్ఫలము. హృదయశుద్ధితో దైవమును ధ్యానించుచు జేసిన దానతీర్థతపోయజ్ఞములు సఫలంబులని భావము. కావున నెల్లప్పుడును దైవన్యస్తభరుండై కర్మాచరణముచేయుట మంచిదని ఫలితార్థము.

శ్లో॥ దేశకాలేచపాత్రేచ తద్దానం సాత్వికం స్మృతమ్ ।
అన్నట్లు సమయమును కనిపెట్టి దానముచేయవలెను.

శ్లో॥ కన్యాగతే భాస్కరేతు పితౄణాం దత్తమక్షయమ్ ।
సూర్యేవృశ్చికే సంప్రాప్తే నిరాశాః పితరోగతాః ॥

తా॥ సూర్యుని కన్యాయమున వొందలి మహాలయకాలంబున పితృదేవతల కివ్వబడినకవ్యము అక్షయంబగును. వృశ్చికసంక్రమణము వెళ్ళినపిమ్మట పితృదేవతలు భగ్నాశులై తమవంశస్థులను శపించిపోయెదరన్నట్లు కాలమును దెలిసి కర్మనారంభించవలెను,

శ్లో॥ దుర్భిక్షేచాన్నదాతారం సుభిక్షేధనదాయినమ్
హేమంతేవస్త్రదాతారం గ్రీష్మేబువ్యాజనప్రదమ్ ॥
ఆతపేఛత్రదాతారం పాదుకాప్రదమేవచ
ఆర్తత్రాణవిధాతారం దాతకొండం ప్రచక్షతే ॥
తద్యోగకాలేయద్దత్తం కించిదప్యధికం భవేత్ ॥

తా॥ కరువులో అన్నమును సుభిక్షకాలంబున ధనంబును చలికాలంబున వస్త్రంబును, గ్రీష్మకాలంబున సిరువిసనకర్రలును మొదలైనవాటిని ఎండకాలమున గొడుగును పాదరక్షలును: భయార్తసమయంబున అభయరక్షణంబును కొంచమైనను నుపయోగించునట్లు చేసినవాడు గొప్పదాతయని పేరుబొందగలడు. అన్నట్లుయేద్రవ్యమే కాలంబున నెవ్వనికి ధర్మముగ నుపయోగార్హమగునో దానిని వానికప్పుడే యిచ్చుటమంచిది.

(కర్త)బుద్ధిపూర్వకముగనైనను, అజ్ఞానమువలననైనను, ప్రమాదమువలననైనను, అనిచ్ఛవలనైనను, పరేచ్ఛవలననైనను, చేసిన పాపములకు ప్రాయశ్చిత్తమును చేసికొనవలయునని ప్రాయశ్చిత్తకాండము చెప్పుచున్నది.

శ్లో॥ ప్రాయశ్చిత్తైరపైత్యేనః అనియుండెను. ప్రాయశ్చిత్తమును నాస్తిక్యాభావముచే జేసికొనకయున్నవారలకు,

శ్లో॥ ప్రాయశ్చిత్తమకుర్వాణాః పాపేషునిరతానరాః ।
అపశ్చాత్తాపినఃకష్టాన్నరకాన్ యాంతిదారుణాన్ ॥

తా॥ ప్రాయశ్చిత్తాదులు జరిగించుకొనక పాపనిరతులై పశ్చాత్తాపరహితులైన మానవులు దారుణమైన నరకములను బొందుదురని స్మృతులు ఘోషింపుచున్నవి. అప్రాయశ్చిత్తములు అనే విధములుగానున్నవి. వానిభేదములు స్మృతులయందును మూలగ్రంథములయందును జూడదగును.

మనుః॥ శ్లో॥ ప్రాయశ్చిత్తం చికిత్సాంచ జ్యోతిషం ధర్మనిర్ణయమ్ ।
వినాశాస్త్రేణయో బ్రూయాత్తమాహుర్బ్రహ్మఘాతకమ్

తా॥ ప్రాయశ్చిత్తమును, ఔషధమును, జ్యోతిషమును, ధర్మశాస్త్రంబును శాస్త్రమెరుగక చెప్పువాడు బ్రహ్మహత్య జేసినవాడగును, కావున యజమానుడుచేసిన పాపములుజక్కగ విచారించి తగు ప్రాయశ్చిత్తముపదేశించవలెను.

వృద్ధహారీత సంహిత-షష్ఠాధ్యాయమందు,

శ్లో॥ అగ్నివర్ణాం సురాంప్రీత్వా సురాపానద్విజాతయః ।
మరణాచ్ఛుద్ధిమృచ్ఛంతి శూద్రసువ్రతమాచరేత్ ॥

తా॥ సురాపానముచేసిన శూద్రునకు ప్రాయశ్చిత్తము కలదుగాని ద్విజునకు కళకళకాగిన సురనుద్రాగి మృతినొందుటయే ప్రాయశ్చిత్తము ఈప్రాయశ్చిత్తభేదములు గ్రంథవిస్తరభీతిచేనిచ్చట చేర్పబడలేదు.

## జీవప్రాయశ్చిత్తము

తాను జ్ఞానాజ్ఞానమువలన చేసిన పాపములకు వెంటనే ప్రాయశ్చిత్తము జేసికొనవలెను. ౬-౩-౧౪ సం॥ కాలపరిమితి ౭-౫-౩-౧ ఏడుగురుగాని నైదుగురుగాని ముగ్గురుగాని యొకరుగాని బ్రాహ్మణ సభచేసి తడిబట్టలతో సువర్ణముగాని వెండిగాని విశేషముగా పరిషత్తుసమర్పించి సాష్టాంగప్రమాణములుజేసి పిమ్మటసభికులు ఏమికార్యముఅని యడిగినపైని, (కర్త) మమజన్మ ప్రభృత్యేతావత్పర్యంతం సమనుష్ఠితానాం జ్ఞానాజ్ఞానకామాకామసకృత్కాయికవాచికమానసిక సాంసర్గికస్పృష్టాస్పృష్టభుక్తాభుక్త పీతాపీత జ్ఞాతాజ్ఞాత సకలపాతకాతిపాతకోపపాతక సంకలీకరణాఽపాత్రీకరణజాతి భ్రంశకరణప్రకీర్ణ పాతకానాంనిరాసార్థ మనుగ్రహంకృత్వాప్రాయశ్చిత్తము పదిశంతు భవంతః॥ అనిపలికి

శ్లో॥ సర్వేధర్మ వివేక్తారో గోప్తారస్సకలాద్విజాః ।
మమదేహస్య సంశుద్ధిం కుర్వంతుద్విజసత్తమాః ।
మయాకృతం మహాఘోరంజ్ఞాతమజ్ఞాతకిల్బిషమ్ ।
ప్రసాదః క్రియతాంమహ్యం శుభానుజ్ఞాంప్రయచ్ఛత ।
పూజ్యైఃకృతః పవిత్రోహం భవేయంద్విజసత్తమైః ।

తా॥ ధర్మవిచారణచేసి రక్షించునోద్విజులారా, నాయందను గ్రహించి జన్మము మొదలుగ జ్ఞానాజ్ఞానములచే నేజేసిన పాపము పరిహరించునట్లు ప్రాయశ్చిత్తముపదేసించి నన్నుపవిత్రునిజేయుండనిని ప్రార్థించవలెను. పుత్రాదులు చేయునప్పుడు అస్యజన్మప్రభృతియని యుచ్చరించునది. అటుపైని, సభ్యులు వానిశక్త్యానుసారముగ ప్రాయశ్చిత్తమునను వాదకుడగు విప్రునిద్వారా తెలియజేయవలెను. ఆపైని గంధాదిపరిమళద్రవ్యములచే సభ్యులనువాదకుని పూజించి పాపానుసారముగ దక్షిణసమర్పించవలెను. ఆపయినసభ్యులు అముకప్రాయశ్చిత్తేన పూర్వోత్తరాంగయుతేన యథాశక్తి ప్రత్యామ్నాయద్వారా చీర్ణేనత్వంశుద్ధో భవిష్యసి॥ యనియనువాదకుచే తెలియచేసినపయిన

అనుకరిష్యే అనిపలికి రిక్తతిథియందు నదిమొదలగు పుణ్యక్షేత్ర ములందు స్నానము ఆచమనముజేసి దేశకాలముల గీర్తించి మనుజ స్మృతిప్రభృతియని మొదలుగ మీదజెప్పినట్లు సంకల్పించి సభ్యోపద్ది ష్టమముకప్రాయశ్చిత్తం పూర్వోక్తరాంగయుతమముక ప్రత్యామ్నా యద్వారా యథాకాలం కరిష్యేనమః యని యుచ్చరించి.

శ్లో॥ యానికానిచపాపాని బ్రహ్మహత్యాసమానిచ । కేశనా శ్రిత్యతిష్ఠంతితిస్మాత్కేశాన్ వప్యామ్యహం॥ అనిపలికి॥

కక్షోపస్థములు వర్జించి మీసము-గడ్డము గోళ్ళను దీయుంచు ఆయుర్బలమని దంతధావనముచేసి, నదియందు స్నానముచేసి రుద్రా యనమః యనుచు భస్మముధరించి "సమస్తపాపక్షయార్థం" అని స్మరించి గోనుయను మృత్తికయు-గోమూత్రము- గొక్షీరము పెరుగు నెయ్యి- కుశోదకము- వీట్లచేస్నానముచేసి స్నానమహాసంకల్పమును విని, స్నానముచేసి సూర్యనారాయణమూర్తినిమనసాస్మరించి మూడు మారులు అర్ఘ్యమిచ్చి, శుద్ధవస్త్రమునుధరించి బొట్టుపెంచుకొని పిమ్మట గోప్రదక్షిణ మాచరించవలెను.

శ్లో॥ నమస్తే కపిలేభద్రే నమస్తే లోకపావనీ ।
సర్వదేవప్రియేనిత్యం జగత్పూజ్యే నమోనమః ॥

ఈమంత్రమును పఠింపుచు గోప్రదక్షిణముచేసి అనంతరమం దు తన పాపనివృత్తికొరకు గోదానముజేయువలెను. ముందుగా బ్రా హ్మణపూజనొనర్చి యథావిధిగా గోదానముచేయువలెను.

గోదానమంత్రమః ॥ శ్లో॥ యజ్ఞసాధనభూతాయా విశ్వస్యాఘప్రణా శనీ విశ్వరూపధరో దేవః ప్రియతాం మేనయాగవా ॥

శ్లో॥ గవామంగేషు తిష్ఠంతి భువనానిచతుర్దశ ।
యస్మాత్తస్మాచ్ఛివం మేస్యాదిహలోకేపరత్ర చ ॥

తనశక్తికొలది దానదక్షిణలిచ్చి పిమ్మట దశదానములు పాప హారుడగు విష్ణువునకు ప్రీతిగజేసి బ్రాహ్మణులను సంతోషపరచి తనశక్తికొలది బ్రాహ్మణసమారాధనము చేయించి లేదా బియ్యము మొదలగు పదార్థములనిచ్చి పంచగవ్యమునకు పూజచేసి పిమ్మట

భక్షించిగాని, లేక యీదినముపవాసముజరిపి మరుదినమునందు పంచ గవ్యము భక్షింపవలయును.

హోమ ప్రకరణము.

పరాశరస్మృతియందు॥ శ్లో॥ తస్మాన్మూ్ఛాదిం సమాసాద్య సదా ధర్మ పథేస్థితమ్ । ప్రాయశ్చిత్తం ప్రదాతవ్యం జపహోమవివర్జితమ్ స్మృతియందు హోమము నిషేధింపబడియున్నది. కనుక విప్రద్వారముగ హోమమనుటచింత్యము. పిమ్మట బంధుభోజనము- దేవతాదర్శనము జేయవలెను తానుచేసిన పాపములకు ప్రాయశ్చిత్తము మరచిన యెడల హీనజన్మప్రాప్తి, నరకప్రాప్తి, రోగప్రాప్తి, మూకత్వాంధత్వాదిప్రాప్తి, దారిద్ర్యప్రాప్తి, మొదలగునవి పాపభేదానుసారముగ తత్తత్తారతమ్యానుసారముగా గలుగునని శాస్త్రమువలన తెలియుచున్నందున తాను తెలివిగలవాడై పాపనిదానంబులయిన రాజసాదిసకలప్రవృత్తులవలన జనించెడి క్రామక్రోధాదులనువిడిచి ప్రవర్తించుటయే ముఖ్యకర్తవ్యము.

---

కర్మాచరణ ఫలము.

శ్లో॥ సునిర్వృత్తాక్రియాచేత్స్యాదా శౌచనియమైస్సహ ।
ప్రాప్నువంతి పితృత్వం హిపిత్రీయాతాః కర్తృబాంధవః ॥

తా॥ మాతాపితరులు మృతినొందిన సమయమునందు పుత్రును ప్రేతకర్మములను చక్కగ నియమయుతముగ నెరవేర్చిరేని యతని మాతాపుత్రులు తత్కర్మానుకూలముగ విధింపబడున పుణ్యలోకములను బొందుదురు. ఇదియునుగాక మాతాపితృవులు పితృదేవత్వము గలవారగుదురు. అట్లగుటచేత ఆనందమునుబొంది తమ పుత్రులు దీర్ఘాయుష్మంతులును తేజోవంతులును ధనవంతులును అగునటుల నాశీర్వచనములను జేయుదురు. అయాశీర్వచన సామర్థ్యమున పుత్రులు సుఖవంతులై యుందురు.

శ్లో॥ పితౄణాంచ ప్రసాదేన కర్తృత్వం శోభివర్ధతే ।
శ్రేయసాంచాభివృద్ధిస్స్యా ద్భూయసాముత్తరోత్తరమ్ ॥

తా॥ పితృదేవతలయొక్క యనుగ్రహముచేత పుత్రాదుల యొక్క వంశము అభివృద్ధిని బొందుటయేగాక గొప్పవగు శ్రేయస్సులనుగూడ విశేషించి కలుగును.

(పురాణోక్తమున కెప్పుడును ఆమశ్రాద్ధమేను) ॥సుమంతుః॥ సద్భాశ్చైవతు మంత్రాణా మామశ్రాద్ధవిధియతే॥ పృథ్వీచంద్రోదయే॥

శ్లో॥ పురాణోక్తోపి సామాన్యంవృద్ధి శ్రాద్ధంచసర్వదా ।
నమస్కారేణ మంత్రేణ కుర్యాదామాన్నవత్సదా ॥

పురాణోక్తమగు క్రియలతోను సామాన్యశ్రాద్ధమును వృద్ధి శ్రాద్ధమునుగూడ నమస్కారమంత్రముతో ఆమద్రవ్యముచేతనే చేయవలెను.

కించ । వేదవ్యాసీయేధర్మశాస్త్రే ప్రథమోధ్యాయః

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియ విశస్త్రయో వర్ణాద్విజాతయః ।
శ్రుతిస్మృతిపురాణోక్త ధర్మయోగ్యాస్తునేతరే ।
శూద్రోవర్ణ శ్చతుర్థోపి వర్ణత్వాద్ధర్మమర్హతి ।
వేదమంత్రస్వధాస్వాహా వషట్కారాదిభిర్వినా ।

తా॥ బ్రహ్మక్షత్రియవైశ్యులు ముగ్గురు ద్విజాతులు, వీరలు శ్రుతిస్మృతి పురాణధర్మయోగ్యులు. ఇతరునుకారు. శూద్రులు నాల్గవవర్గము వారయినప్పటికిని వర్ణములలో ముఖ్యధర్మమునకుదగిన వారుగాని వేదమంత్ర స్వధాస్వాహావషట్కారాదుల కర్హులుగారు తక్కినవిషయములు నిర్ణయసింధువునందు చూడవలయును.

ఉత్క్రాంతి విషయము.

ఛందోగోపరిశిష్టే॥శ్లో॥దుర్బలంస్నాపయిత్వాతు శుద్ధిచేలాభిసంభృతే) దక్షిణాశిరసంభూమౌ బర్హిష్మత్యాం నిధాపయేత్ । ఘృతేనాభ్యక్త మాప్లావ్య శుద్ధవస్త్రోపవీతినా । చందనోక్షిత సర్వాంగే సుమనోభిర్విభూషయేత్ । హిరణ్యశకలాన్యస్య క్షిప్త్వాచిద్రేషుసప్తసు । ముఖే

ష్వథాపిధాయైవం నిర్హారేయుస్సుతాదయః । కర్ణేనేత్రేముఖాఘ్రాణే హిరణ్యశకలంన్యసేత్ ॥

తా॥ ప్రాణములు క్షీణించగానే స్నానము జేయించి శుద్ధమైన బట్టలుబరచి దర్భలతోగూడిన భూమియందు దక్షిణశిరస్సుగాబరుండ బెట్టి శుద్ధవస్త్రముపవీతముగ ఘృతముచేబూసి చెవులు- నేత్రములు- ముఖము- ఘ్రాణరంధ్రములు ననునేడింటియందు సువర్ణశకముల నుంచి ముఖముగప్పి కుమారుడు మొదలగువారు గొనిపోవలెననుట.

దివోదాసీయమందు — ఋణధేనుదానము

శ్లో॥ ఆజన్మోపార్జితం పాపం మనోవాక్కాయకర్మభిః
తత్సర్వంనాశమాయాతు గోప్రదానేన కేశవ॥
యనుమంత్రముతో ధేనుదానము చేయవలెను.

వ్యాసః శ్లో॥ ఆసన్నమృత్యునాదేయం గౌస్సవత్సాతుపూర్వవత్ ॥
తదభావేతుగౌరేవ నరకోత్తారణాయవై ॥

తా॥ మరణకాలమందు వత్సతోగూడిన గోవునుగాని లేదా సువర్ణ గోవునైనను నరకముద్ధరించుటకు దానము చేయవలెననుట

తిలపాత్రిదానము

మదరత్నమందు జాతుకర్ణ్య వచనమెట్లనిన,

శ్లో॥ ఉత్క్రాంత్యాదీనిదానాని దశదద్యాత్స్మృతిస్థితు ॥ గోభూతిల హిరణ్యాజన వాసోధాన్యగుడానిచ। రౌప్యంలవణమిత్యాహు ర్దశదానాన్యనుక్రమాత్ ॥ ఏతానిదశదానాని నరాణాంమృత్యుజన్మనో । కుర్యాదభ్యుదయార్థంతు ప్రేతత్వేపి వరత్రవై ॥

తా॥ గోభూతిల హిరణ్యాదిదానములు పదియు జన్మకాలమందభ్యుదయము కొరకును మరణకాలమందు సుగతికొరకును జేయవలెను. (మరణానంతరమపి ఏతన్నియమేన కర్తవ్యం) ప్రాణముపోయినపిమ్మట గూడ పైనజెప్పిన విధిప్రకారము కర్మములజేయవలయును.

బ్రాహ్మః ॥ శ్లో॥ తామ్రపాత్రంతిలైః పూర్ణం ప్రస్థమాత్రం ద్విజా

యతు సహిరణ్యంచయోదద్యా చ్ఛ్రిద్ధావిత్తానుసారతః సర్వపాప విశుద్ధాత్మా లభేతగవముత్తమామ్ ॥

తా॥ రాగిపాత్రిలో నొకశేరు నువ్వులుపోసి యథాశక్తి హిరణ్యముతో బ్రాహ్మణునికి దానముచేసిన సర్వపాపములుపోయి యుత్తమగతిని బొందుదురు.

కర్ణమంత్రి పఠనము.

పరిశిష్టే— మ్రియామాణస్య కర్ణేతుపుణ్యమంత్రాన్ జపేతత్తతః ॥

తా॥ మరణకాలమందు పుణ్యమంత్రముల నతనికర్ణమందు జపించవలెననుట.

పద్మపురాణే॥ శ్లో॥ కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే ప్రణతః క్లేశనాశాయ గోవిందాయనమోనమః ఇమమంత్రింజపం కుర్యా త్సకృద్వాప్రత్యహంనరః । సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకమవాప్నుయాత్ ॥

తా॥ కృష్ణాయనమః - వాసుదేవాయనమః - విష్ణవేనమః గోవిందాయనమః అను నీనామమంత్రంబును ప్రతిదినంబునొక్కమారుజపించిన నరుండు సర్వపాపములనుండి తొలగి విష్ణులోకంబును బొందుదుకనుట.

షణ్ణిమిత్త ప్రాయశ్చిత్తవిధిః

స్మృతులయందు చెప్పబడిన ప్రకారము ఊర్ధ్వోచ్ఛిష్టము- అధోచ్ఛిష్టము - అంతరిక్షమరణము - ఆశౌచమరణము - ఖట్వాది మరణము - అను నారువిధంబులగు మరణములయందును చండాలశ్వపచాదుల వలన గలిగిన మరణమునందును విప్రవాక్యానుసారముగా కృచ్ఛ్రిత్రయంబులను ప్రాయశ్చిత్తార్థంబుగ నాచరింపవలయును.

ఇందుకుప్రమాణము — స్మృతితత్వనిర్ణయే.

శ్లో॥ ఊర్ధ్వోచ్ఛిష్టేప్యధోచ్ఛిష్టే అంతరిక్షమృతౌతథా ।
ఆశౌచమరణేచైవ కృచ్ఛ్రత్రియ ముదాహృతమ్ ॥

తథాచ॥ శ్లో॥ ఊర్ధ్వోచ్ఛిష్టేత్వధోచ్ఛిష్టే ఖట్వాయాం మరణేతథా అంత
రామరణేచైవ ఆశౌచమరణేతథా । అగ్నితోమరణేచైవ త్రిభిఃకృచ్ఛ్రై
ర్విశోధనమ్ ॥

స్మృతిసంగ్రహే ॥ శ్లో॥ అస్నాత్వామరణేఘోరే ఆశౌచమరణేసతి
ఉచ్ఛిష్టమరణేచైవ ఖట్వాయాం మరణేతథా। చండాలాశ్వాసనంస్పృష్టే
ష్వాకాశమరణేసతి చండాలాన్మరణేవాపి త్రిభిఃకృచ్ఛ్రైపృథక్ పృథక్ ।

శ్లో॥ విప్రవాక్యానుసారేణ ప్రత్యాఖ్యాయ విధిర్యథా ॥
కృత్వాతుదహనంకార్య మన్యథాకిల్బిషీభవేత్ ॥

శుద్ధిరితి విశేషః ॥ ఇతిషణ్ణిమిత్త ప్రాయశ్చిత్తవిధిస్సమాప్తః

---

## మధుపర్కదానము

వారాహే॥ శ్లో॥ దృష్ట్వాసువిహ్వలం హ్యేనం యమమార్గానుసారిణమ్॥ ప్రయాణకాలేతునరో మంత్రేణవిధిపూర్వకమ్ ॥ మధుపర్కంత్వరయా గృహ్యఇమంమంత్ర ముదీరయేత్ ॥ గృహాణచేమం మధుపర్కమాద్యం । సంసారనాశనంకరం త్వమృతేనతుల్యం । నారాయణేనరచిత భగవత్ప్రియాణామ్ । దాహేనశాంతికరణం సురలోకపూజ్యం ॥ అనేనైవతు మంత్రేణ దద్యాచ్ఛమధుపర్కకమ్ నరస్యమృతుకాలేతు పరలోక సుఖావహామ్ ॥

తా॥ మరణకాలమందు పుత్రులు మొదలైనవారు మధుపర్కముదెచ్చి గృహాణచేమంఅను శ్లోకమంత్రము నుచ్చరింపుచు పరలోకసుఖమునిచ్చు మధుపర్కము దినిపించునది.

## మరణకాల దోషశాంతి.

యమః శ్లో॥ నందాయాంగాః ప్రదాతవ్యా భత్రే భూమిరనంతరమ్ ।
విప్రేభ్యోదీయతేయేన నదోషస్తత్రవిద్యతే ॥

దుష్టవారేషు మృతప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః ।

శ్లో॥ ఖానావజేశనానస్త్రంత తద్వర్ణం ప్రదాపయేత్ ॥
భృంగాహిరణ్య సహితం వస్త్రదానం విశోధనమ్ ॥

తదాహామరీచిః॥ శ్లో॥ భద్రేభూమిప్రదానంస్యా త్త్రిపాద క్షేహిరణ్యదః॥ వారేవారాధి దైవత్యం వాసోదానంవిధీయతే। రక్తవస్త్రంకుజేభానౌ శ్వేతంశుక్రేప్రకల్పితం। శనైశ్చరేతునీలంస్యా దేతద్దోషోపశాంతయే॥ దద్యాచ్ఛుద్ధి మవాప్నోతి హ్యదత్వాదోషమాప్నుయాత్ ద్విత్రిపాదినక్షత్ర మరణేవస్త్రసహిత హిరణ్యదానంకుర్యాత్ ధనిష్ఠాపంచక మరణే। ప్రాయశ్చిత్తమాహ — మదనరత్నే॥

శ్లో॥ ఏకాశీతిపలంకాంస్యం। తదర్ధంవాతదర్ధకమ్।
నవషట్త్రిపలంవాపి దద్యాద్విప్రాయశక్తితః॥

పక్షాంతరమాహ॥ శ్లో॥ యమాయధర్మరాజాయమృత్యవే చాంతకాయచ।

వైవస్వతాయకాలాయ। సర్వభూతక్షయాయచ। ఔదుంబరాయ దధ్నాయ నీలాయపరమేష్ఠినే। వృకోదరాయ చిత్రాంగ చిత్రగుప్తాయ వైకరమాత్॥

ఇతిఆహుతిత్రయం హోమంకుర్యాత్ - ప్రేతముఖేహిరణ్యం వాపంచరత్నానివానిక్షిపేత్॥ అథత్రిపుష్కరద్విపుష్కరాదిమరణే గోభూతిలాదీన్ బ్రాహ్మణాయదద్యాత్। విశేషోనిర్ణయసింధౌజ్ఞేయః

త్రిపుష్కర మరణము.

| వారములు | తిథులు | నక్షత్రములు |
|---|---|---|
| ఆది | ద్వాదశి | మఘ |
| సోమ | ఏకాదశి | విశాఖ |
| మంగళ | దశమి | ఆర్ద్రా |
| బుధ | తృతీయ | మూల |
| గురు | షష్ఠి | శతభిషక్ |
| శుక్ర | ద్వితీయా | రేవతి |
| శని | సప్తమి | ఉషా |

నిర్ణయామృతే॥ శ్లో॥ ద్వాదశ్యేర్క మఘాయుక్త విశాఖై కాదశీందునా కుజాద్రాన్ దశమీచైవ । ద్వితీయా భృగు రేవతి తృతీయా బుధమూలేన గురుషష్ఠిశతోషునా । సప్తయోగాస్త్రి పుష్కరాః ॥

అథద్విపుష్కరయోగః॥ మదనరత్నే గార్గ్యః॥

శ్లో॥ యదిభద్రాతిథీవాంస్యా ద్భానుభౌమశనైశ్చరైః ॥
త్రిపాదృక్షైశ్చసంయోగోద్వాయోర్యోగో ద్విపుష్కరః ॥

అథదహన నియమః

ప్రత్యక్షశవము దహనము చేయునపుడు పంచాగము విచారించి నవసరములేదు.

గాలవః॥— శ్లో॥ ప్రథమేహని కర్తవ్య వపనంచానుభావినామ్ ।
ప్రేతస్య కేశశ్మశ్రాది వాపయిత్వా దదాహయేత్

తా॥ ప్రథమదినమందు కర్త క్షవరముజేసికొని ప్రేతకు కేశములు మీసము గడ్డము మొదలుగ క్షవనముజేయించి యటుపై దహించవలెనని గాలవచనము.

మనుః- శ్లో॥ దక్షిణేనమృతంశూద్రం పురద్వారేణ నిహర్హరేత్ ।

తా॥ శూద్రశవము దక్షిణముగ దీసుకొనిపోవలెనుఅనుప్రమాణముగలదు. లోకమందు సర్వజనులు వారివారి వీలుప్రకారముపోవుచున్నారు.

## దహననియమః

కమలాకనుస్మృతౌ॥ మనుః— శ్లో॥ ఆమపాత్రేన్నమాదాయ ప్రేతమగ్నిపురస్సరమ్ । ఏకోనుగచ్ఛేత్తస్యార్థమర్ధసధ్యూత్సృజేద్భువి ఊర్ధ్వమాదహానంకార్య మాసీనోదక్షిణాముఖః । సవ్యంజాన్వాచ్యశనకైస్సతిలపిండదానవత్ । అథపుత్రాదిరాప్లుత్య కుర్యాద్దారూచ్ఛయం మహాత్ । తతోత్రైనంనిపాత్యైనం దక్షిణాశిరసంముఖే ।

తా॥ కొత్తకుండలో అన్నము అగ్నిహోత్రము దీసికొని ముందుగా కర్త నడుపవలెను. అతనివెనుక నందరు నడుచుచు అర్థమార్గమందు శవమునుంచి దక్షిణముఖముగా నెడమకాలుమడిచి తిలలతో

పిండదానవిధిగా అన్నముభూమిపై నుంచి యిట్లు మూడు పెంపులుజరిపి పుత్రులు మొదలైనవారు స్మశానమందు కర్రలు చాలా చితిగాచేర్చి దానిపయి దక్షిణశిరస్సుగా శవమును వెల్లకిలబరుండబెట్టి ముఖమం దగ్నినిచ్చునది. కొందరు అన్నమునకు బదులు బియ్యము నుపయో గించు చున్నారు.

శుద్ధితత్వే-హారలతాయామ్॥ శ్లో॥ స్వగోత్రజై గృహీత్వా తుతుచితావారోప్య శేశవః । అధోముఖోదక్షిణాదిక్చరణస్తుపుమా నపి । ఉత్తానదేహోనారీతు సపిండైరపిబంధుభిః ॥

తా॥ తనగోత్రమువారు శవమును చితిపై బెట్టునప్పుడు పురుషుడైనచో నధోముఖముగ నుత్తరశిరముగను స్త్రీయైనచో వెల్లకిలగా నుంచవలెను.

ప్రచేతః- శ్లో॥ నగ్నదేహందహేన్నైవకించిద్దేయం పరిత్యజేత్ ॥

తా॥ ప్రేతనుదిగంబరునిగా దహింపగూడదు, తీసివేయవలసినది. మరియేదైననుపరిత్యజించవచ్చును.

క్రియానిబంధేగరుడః॥ శ్లో॥ ఉదధారామవిచ్ఛిన్నాం......చేత్కర్తా ప్రదక్షిణమ్ । స్కంధావసక్తకుంభేనపాదతః పరితశ్చితేః ॥

తా॥ నీళ్ళతోనిండిన కుండను కర్త భుజముపై నుంచుకొని పాదములవైపు మొదలుకొని యనగా దక్షిణము మొదలుగ చితిచుట్టును నీళ్లధారపడునట్లు ప్రదక్షిణము జేయవలెను.

మాతాపితృవుల సహగమన మరణమునుగురించి బోధాయన స్మృతియందు దాహాంతమొక్క తంత్రము, పంచయజ్ఞములనోకతంత్రము వుదకపిండదానాదికము వేరువేరుగ జేయవలెననియున్నది,

ఇతి దహననియమ స్సమాప్తః

## తిలోదక వాసోదకనిర్ణయః

కాలాదర్శే॥ శ్లో॥ కర్తానోప్యుదకాంజలీన్ తిలాయుతాన్ త్రీ దద్యురాద్యేదినేచైకైకోత్తరవృద్ధిరాదశదినా త్స్యుపంయుశిలాయాం పితుఃమృతాస్నానత్రయంభవే త్ప్రతిదినం వస్త్రోదకానాంత్రయమ్ పిండస్త్వేక ఇహాకృతం యదిపితుర్దద్యాద్దశాహేఖిలమ్ ॥

తా॥ బ్రాహ్మణులకు పుత్రులందరును పితృప్రీతికొరకు శిలయందు తిలోదకమును ప్రథమదినంబున 3 ను. అదిమొదలొకొక్కదినంబున నొక్కొక్కమారధికముగ విడువగ ౧౦. దినమువరకు నవియున్నియు ౭౫ అగుననియు, క్షత్రియులకు మరణదినముమొదలు ప్రతిదినంబును ౫ మార్లను విడువగ నవియున్నియు ౬3 అగుననియు, వైశ్యులకు ప్రతిదినంబును ౪ మార్లుచొప్పున ౧౫ దినములకు ౬౦ అగుననియు, ౧౫ దినములైతే ప్రతిదినము ౬ చొప్పున అవియున్నియు ౯౦ యగుననియు, బ్రాహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, అశౌచనివృత్తికొరకు ప్రతిదినము 3 మృత్తికాస్నానములు, 3 వాసోదకములు ౧ పిండప్రదానము జేయవలెను. నిత్యమును కర్మజేయకున్న ఆశౌచాంత్యదినంబునదైనా ఆచరించవలెను గాని మానగూడదనిరి.

ప్రాచీనగ్రంథే॥ శ్లో॥ ఏకమాతృప్రసూతానాం జ్యేష్ఠోదద్యాచ్ఛవాససా । వినాపితృభ్యామన్యేషాం జ్ఞాతినాంసవ్యవాససా ॥

తా॥ ఆర్యా! ఒకతల్లికి బహుమంది పుత్రులుందురు. అప్పుడు జ్యేష్ఠపుత్రునికే వాసస్సుయందధికారముదలదు; తక్కినపుత్రులందరును వారివారిపై వస్త్రములతోనే జరుపవలెను. పితృవినా తండ్రివినగా- జ్ఞాతులందరును స్వస్వవాసస్సుచేతనే. వాసోదకములు విడువవలయును, అయితే లోకమందు కొందరుజ్ఞాతులుమాత్రము విడుచుటలేదు. తిలోదకములుమాత్రి మిచ్చుచున్నారు,

ఇతి తిలోదక వాసోదక నిర్ణయస్సమాప్తః

—• తిలోదకాదినిషేధః •—

మాధవీయే-ఋష్యశృంగః శ్లో॥ ఆశౌచమంతరాదర్శో యది స్యాత్సర్వవర్ణినామ్ । సమాప్తిం ప్రేతతంత్రస్య కుర్యాదిత్యాహ గౌతమః

తా॥ ఆశౌచమధ్యమందు దర్శసంభవించితే మిగిలిన ప్రేతకర్మతంత్రమునమావాస్యకు సమాప్తి చేయునది.

విశేష: శ్లో॥ అంతర్దశాహేదర్శ శ్చేత్తత్రసర్వంసమాపయేత్
పితోస్తుమాసదాశౌచం దద్యాత్పిండాన్ జలాంజలీన్ ॥

తా॥ దశాహమధ్యమందు దర్శసంభవించినప్పుడు తల్లిదండ్రు
లకైనచో నాశౌచాంతమువరకును పిండములు జలాంజలులు నివ్వ
వలెను. ఇతరులకైనయెడల దర్శలోపున సమాప్తి చేయవలెను.

గాలవః ॥శ్లో॥ పితోరాశౌచమధ్యేతు యదిదర్శస్యమాపయేత్ ।
తావదేవోత్తరంతంత్రం పర్యవస్యేత్ర్యహాత్పరః ॥

తా॥ తల్లిదండ్రుల యాశౌచమధ్యమందు మూడుదినములపైని
దర్శవచ్చినచో నుత్తరతంత్రము యావత్తును సమాప్తి యవలెను
ఇతరులకైనచో మూడు దినములులోగా దర్శవచ్చినను సపకమన్వము
జేయవలెను. కాలామృతమందును నిర్ణయామృతము తమందును
నిట్లనేయున్నది. మదనరత్న పారిజాతములందు మాత్రము గాలవవచన.
మాపత్కాలీనమందు నౌరసపుత్రుడు కర్తయగునప్పుడు నని చెప్పబడినది
కనుక తల్లిదండ్రులకు మూడుదినములపైని దర్శవచ్చినను నపక్షము
లేదని యున్నదిగాని యిందుమూలము చింత్యము.

ఇతి తిలోదకాది నిషేధస్సమాప్తః,

## —♦ శ్రాద్ధస్థల నిరూపణమ్ ♦—

ఔశనసస్మృతౌ పంచమాధ్యాయే॥ శ్లో॥ శుచిదేశంవివిక్తంచ గోమ
యేనోపలేపయేత్ । నదీతీరేషుతీర్థేషు స్వభూమౌగిరిసానుషు ॥

శ్లో॥ వివిక్తేషుచతుష్యంతి దత్తేనపితరస్తథా । పరస్యభూమి
భాకేతు పితౄణాం నైవనిర్వపేత్ । స్వామినాతద్విహన్యేత మో
హాద్యత్క్రియతేనరైః శ్లో॥ అటవ్యఃపర్వతాఃపుణ్యాస్తీర్థా న్యాయత
నానిచ సర్వాణ్యస్వామికాన్యాహు ర్నహిఈతేషుపరిగ్రహః ॥ తిలాం
శ్చావికిరేత్తత్ర సర్వతోబంధయేదజాన్ । అసురోపహతంసర్వం
తిలైశ్శుద్ధ్యత్యజేనహి ॥

తా॥ పరిశుద్ధమగు ప్రదేశమును గోమయముచే శలుకవల

యును, ఇంకనిట్లు నదీతీరములందు, పుణ్యక్షేత్రములందు, స్వగృహమందు, పర్వతచర్యయందు, రహస్యప్రదేశములందు, శ్రాద్ధమును చేసినయెడల పితృదేవతలు తృప్తినిబొందుచున్నారు. ఎప్పటికిని పరగృహమందు పితృలకు శ్రాద్ధముజేయకూడదు. ఎవడుగాని మోహముచే పరగృహంబున శ్రాద్ధముజేయునో అది యాగృహపితృలవలన హరింపబడుచున్నది. అడవులు పర్వతములు, పుణ్యతీర్థములు, దేవాలయములాదిగాగల సర్వము అస్వామికములు గావున వానియందు చేయబడిన శ్రాద్ధము లితరులచే గ్రహింపబడవు అంతటను నువ్వులు జల్లి అజిములను బంధింపవలయును, నువ్వులులేనిచో సర్వమును రాక్షసులచే హరింపబడినదగును.

ఇతి శ్రాద్ధస్థల నిరూపణము సమాప్తమ్.

—♦ శ్రాద్ధకర్తృభోక్తృనియమః ♦—

ఔశనసస్మృతౌ పంచమోఽధ్యాయే॥ శ్లో॥ దత్వా శ్రాద్ధంతతో భుక్త్వా సేవతేయస్తుమైథునమ్ । మహారౌరవమాసాద్య కీటయోనిం వ్రజేత్పునః శుచిరక్రోధనశ్శాంత స్సత్యవాదీసమాహితః స్వాధ్యాయంచ తథాధ్యానం కర్తాభోక్తా నిసర్జయేత్ ॥ శ్రాద్ధదత్వాఽపరం శ్రాద్ధం భుంజతేమేద్విజాతయః । మహాపాతకినస్తుల్యా యాంతితే నరకాన్బహూన్ ॥

తా॥ శ్రాద్ధకర్తయు- భోక్తయు- మైథునమును జేసిన యెడల మహారౌరవ నరకమునుబొంది మరల పురుగుల రాసియందు బుట్టుచున్నారు, శ్రాద్ధకర్తయు భోక్తయు పరిశుద్ధులై క్రోధరహితులై శాంతముగలవారై సత్యవాదులై స్వస్థచిత్తులలై యుండి వేదమును ధ్యానము విడువవలయును, ఏద్విజులు శ్రాద్ధమునుబెట్టి యితరశ్రాద్ధమందు భుజింపుదురో అట్టివారు మహాపాతకసములై నరకము ననుభవించెదరు.

కించ॥ శ్లో॥ ఆమంత్రితో బ్రాహ్మణో వై యోన్యస్మై కురుతేక్షణమ్।
ఆమంత్రయిత్వా యో మోహాదన్యం వాఽఽమంత్రయేద్ద్విజ. సతస్మాదధికః పాపీ విష్ఠాకీటోఽభిజాయతే శ్రాద్ధే నిమంత్రితో విప్రో మైథునం యోఽధిగచ్ఛతి । బ్రహ్మహత్యామవాప్నోతి తిర్యగ్యోని షుజాయతే నిమంత్రితశ్చ యో విప్రో హ్యధ్వానం యాతి దుర్మతిః భవంతి పితరస్తస్య తన్మాసం పాంసుభోజనాః నిమంత్రితశ్చ యశ్శ్రాద్ధే ప్రకుర్యాత్కలహం ద్విజః భవంతి తస్య తన్మాసం పితరో మలభోజనాః తస్మాన్నిమంత్రితశ్శ్రాద్ధే నియతాత్మా భవేద్ద్విజః ॥

తా॥ శ్రాద్ధమునందు నిమంత్రితుడై మరియొక శ్రాద్ధమందు క్షణమును గ్రహించువాడును ఒకరిని బిలచి మోహమువల మరియొకరిని బిలుచువాడును వీరిద్దరరధిపాపులై పురుగుల రాశియందు బుట్టెదరు. ఎవడు శ్రాద్ధమునందు నిమంత్రితుడై మైథునమును చేయునో వాడు బ్రహ్మహత్యనుబొంది పశుపక్షి మృగాదులయందు జనించును ఏదుష్ట బ్రాహ్మణుడు నిమంత్రితుడై భోజనముచేసి ప్రయాణము చేయునో అతని పితృదేవతలు మాంసము మార్గధూళిని భుజించువారలగుచున్నారు. ఏద్విజుడు శ్రాద్ధమందు నిమంత్రితుడై కలహమును చేయునో వానిపితరులు ఆమాంసము మలమును భుజింప్రవారగుచున్నారు. అందువలన శ్రాద్ధమందు నిమంత్రితులగు ద్విజలు నియత చిత్తులయి యుండవలయును.

యల్లాజియ్యే॥ శ్లో॥ దంతధావనమభ్యంగం నఖకేశనికృంతనమ్ ।
కర్తా చైవ తు పూర్వేద్యుర్భోక్తా చైవ పరేఽహని దంతధావన తాంబూలం క్షౌరాభ్యంగమభోజనమ్ । రత్యౌషధపరాన్నంచ శ్రాద్ధకర్తా వివర్జయేత్ ॥

తా॥ శ్రాద్ధకర్త పూర్వదినమందు శ్రాద్ధభోక్త పరదినమునందు దంతధావనమును అభ్యంగనమును నఖకేశనికృంతనమును తాంబూలమును క్షౌరమును అభోజనమును సురతమును పరాన్నమును విడువవలయును. శ్రాదకర్తృభోక్తృనియమములు సమాప్తము.

---

# అపరకర్మ ప్రారంభః

అత్రాదౌ సర్వప్రాయశ్చిత్త ప్రయోగః

కర్తా సచేలంస్నాత్వా ఆచమ్య॥ ఏవం... పితుః—గోత్రస్య నామధేయస్య ఇహజన్మనిజన్మాంతరేషు సమస్త పాపక్షయార్థం సర్వ ప్రాయశ్చిత్తమాచరిష్యే । అస్తుపరిషదక్షిణాంగృహీత్వా ॥ శ్లో॥ సమస్త ...స్వీకృత్య... జన్మాభ్యాసాజ్జన్మ ప్రభృతి ఏతత్క్షణపర్యంతం మధ్యేవర్తిన్ కాలే బాల్యయౌవనకౌమార వార్ధకేషుజాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాసు మనోవాక్కాయేంద్రియ వ్యాపారైః రహసిప్రకాశేచ జ్ఞానతోఽజ్ఞానతశ్చత్వయాకృతానాం ప్రకాశకృతమహాపాతక చతుష్టయ వ్యతిరిక్తానాం ప్రకాశకృతానాం మహాపాతకాది దిష్ట రూప మహాపాతకవ్రతాఽతి దేశికరూపాతిపాతకానాం ప్రకాశకృత మహాపాతక సమరూపానుపాతకానాం ఉపపాతకానాం సంకలీకరణానాం మలినీకరణానాం అపాత్రీకరణానాం జాతిభ్రంశకరాణాం అవకీర్ణకానాం ప్రకీర్ణకానాం రహస్యకృతానాం - మహాపాతకానాం రహస్యకృతమహాపాతకాతిదిష్టరూప మహాపాతకవ్రతాతి దేశికరూపాతిపాతకానాం రహస్యకృతమహాపాతకసమరూపాతి పాతకానాం ఉపపాతకానాం సంకలీకరణానాంమలినీకరణానాం అపాత్రీకరణానాం జాతిభ్రంశకరాణాం అవకీర్ణకానాం ప్రకీర్ణకానాం ఏవంబహూనాం బహువిధానాం సర్వేషాంపాపానాం అజ్ఞానతస్సకృత్కృతానాం అజ్ఞానతోభ్యస్తానాం జ్ఞానతస్సకృత్కృతానాం జ్ఞానతోభ్యస్తానాం అజ్ఞానతో జ్ఞానతశ్చాత్యంతాభ్యస్తానాం అజ్ఞానతో జ్ఞానతశ్చ నిరంతరాభ్యస్తానాం అజ్ఞానతో జ్ఞానతశ్చ చిరకాలాభ్యస్తానాం బహూనాం బహువిధానాం సర్వేషాంపాపానా మపనోదకం ప్రాయశ్చిత్తం ఉపదిశేతివిజ్ఞాప్య - పునఃప్రణమ్యతిష్ఠేత్ యజమానస్యపితుః జన్మాభ్యాసా జన్మప్రభృత్యే తత్క్షణపర్యంతం మధ్యేవర్తినకాలే బాల్యయౌవనకౌమారవార్ధకేషుజాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాసు మనోవాక్కాయకర్మేంద్రియవ్యాపారైః- రహసిప్రకాశేచ జ్ఞానతోఽజ్ఞానతశ్చత్వయాకృతేభ్యః ప్రకాశకృత మహాపాతకచతుష్టయవ్యతిరిక్తేభ్యః ప్రకాశకృతమహాపాతకా తిదిష్టరూపమహాపాతకవ్రతాఽతి దేశికరూపాతిపాతకేభ్యః ప్రకాశకృతమహాపాతక సమరూపానుపాతకభ్యః

ఉపపాతకేభ్యః సంకలీకరణేభ్యః మలినీకరణేభ్యః- అపాత్రీకరణేభ్యః జాతిభ్రంశకరేభ్యః ప్రకీర్ణకేభ్యః రహస్యకృతేభ్యో మహాపాతకేభ్యః రహస్యకృత మహాపాతకాతిదిష్ట రూపమహాపాతక ప్రత్యాఽతిదేశిక రూపాతిపాతకేభ్యః రహస్యకృత మహాపాతక సమరూపానుపాతకేభ్యః ఉపపాతకేభ్యః- సంకలీకరణేభ్యః మలినీకరణేభ్యః- అపాత్రీకరణేభ్యః- జాతిభ్రంశకరేభ్యః- అపకీర్ణకేభ్యః- ప్రకీర్ణకేభ్యః- అజ్ఞానతస్సకృత్కృతేభ్యః అజ్ఞానతోభ్యస్తేభ్యః జ్ఞానతస్సకృత్కృతేభ్యః జ్ఞానతోఽభ్యస్తేభ్యః- అజ్ఞానతోజ్ఞానతశ్చాత్యభ్యస్తేభ్యః- అజ్ఞానతోజ్ఞాతశ్చనిరంతరాభ్యస్తేభ్యః- అజ్ఞానతోజ్ఞానతశ్చ చిరకాలాభ్యస్తేభ్యః- బహుభ్యః- బహువిధేభ్యస్సర్వేభ్యః పాపేభ్యః (త్వం) ముక్తోభూయాః ముక్తోభూయాఃఇత్యనుగృహ్ణంతుభవంతః ఇత్యుచ్చైర్వదేత్॥ ఏవంఽర్థం మమజన్మాభ్యాసా జన్మప్రభృత్యేతత్క్షణపర్యంతం- సమస్తదోష నిర్హరణార్థం స్వర్ణధాన్య ఆజ్యకృచ్ఛ్రాన్యాచరిష్యే॥

శ్లో॥ స్వర్ణంపవిత్రమమలం స్వర్ణం పాపప్రణాశనమ్॥ స్వర్ణంహి శంకరో యశ్మాదతశ్శాంతింప్రయచ్ఛమే॥ బ్రాహ్మణాయ సువర్ణదానం దద్యాత్॥

శ్లో॥ ధన్యంకరోషిదాతార మిహలోకేపరత్రచయస్మాత్తస్మాచ్ఛివంమేస్యా దతశ్శాంతింప్రయచ్ఛమే (ధాన్యం) దద్యాత్ ॥

శ్లో॥ కామధేనోస్సముద్భూతం సర్వక్రతుషుసంస్థితమ్। దేవానామాజ్యమాహార మతశ్శాంతింప్రయచ్ఛమే॥ (ఆజ్యం) దద్యాత్ ॥

శ్లో॥ హిరణ్యగర్భగర్భస్థం హేమబీజంవిభావసోః। అనంతపుణ్యఫలద మతశ్శాంతిం ప్రయచ్ఛమే॥ ... (హిరణ్యం) దద్యాత్ ॥

ఇదంకృచ్ఛ్రత్రయ ప్రత్యామ్నాయం యథాశక్తి హిరణ్య॥ శ్రీమహావిష్ణుప్రీతిం కామయమానస్తుభ్యమహం సంప్రదదేనమమ శ్రీగోవిందగోవింద॥ ఏవంఽర్థం॥ సర్వప్రాయశ్చిత్త గోదానమాచరిష్యే॥ తదంగ బ్రాహ్మణపూజాం కరిష్యే ॥ శ్రీమహావిష్ణుస్వరూప

స్య బ్రాహ్మణస్య ఇదమాసనం దదామి ॥ ఉభాభ్యామిదం పాద్యం దదామి ॥

శ్లో॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే । సహస్రనామ్నే పురుషాయశాశ్వతే సహస్రకోటి యుగధారిణేనమః॥ అయంవోగంధః+ సకలారాధనైః స్వర్చితమస్తు ॥

శ్లో॥ గవామంగేషుతిష్ఠంతి భువనానిచతుర్దశ । యస్మాత్తస్మాచ్ఛివంమేస్యా తదశ్యాంతిం ప్రయచ్ఛమే ॥ అస్మై బ్రాహ్మణాయ ప్రతిగృహీతే శ్రీమాన్ శ్రీమతః అహం శ్రీమహావిష్ణుప్రీతయే సర్వ ప్రాయశ్చిత్త గోదానం తుభ్యమహం సంప్రదదేనమమ॥

శ్లో॥ దేవస్యత్వాసవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాం ప్రతిగృహ్ణామి ॥ గోదానందద్యాత్ ప్రతిగృహ్ణాతు ॥ గోదానసాద్గుణ్యార్థం దక్షిణాంతు ... నమమ॥ విధిప్రకారేణ దశదానానికుర్యాత్ । సర్వప్రాయశ్చిత్తంసమాప్తమ్॥

ఉత్క్రాంతి ప్రయోగః

యస్యపురుషస్యమరణేసంప్రాప్తే సతి-పుత్రాదిః కర్తాశుచిర్భూత్వా-శుచౌదేశేగోమయేనానులిప్య । తత్రశుద్ధోదకం సంప్రోక్ష్య కుశాన్పరిస్తీర్య తిలానవకీర్య । పితరం దక్షిణశిరసంవిధాయః స్నాత్వా ఆచమ్య పవిత్రధృత్వా శ్రీగోవింద గోవింద- కేశవాయనమః పితుః గోత్రస్య ... స్య నామ్నోభ్యాసాజన్మప్రభృతిమరణకాల పర్యంతం సంభావిత సమస్తపాపక్షయార్థం సుఖేన ప్రాణోత్క్రమణసిద్ధ్యర్థం ఉత్క్రాంతిసంజ్ఞిత గోదానమాచరిష్యే॥ తదంగబ్రాహ్మణ పూజాంకరిష్యే ॥ శ్రీమహావిష్ణుస్వరూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనందదామి॥ ఉభాభ్యామిదంపాద్యందదామి॥ నమః అస్తు॥

శ్లో॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే । సహస్రనామ్నే పురుషాయశాశ్వతే సహస్రకోటి యుగధారిణేనమః శ్రీమహా... అయంవోగంధః అలంకారార్థాక్షమే అక్షతా స్సంక్వక్షతాక్షతాస్సకలారాధనైః స్వర్చితమస్తు॥

## * గయా శ్రాద్ధ ఫలమ్. *

శ్లో॥ పిత్రాదేర్బహుమాన కర్మఫలదం తృప్తిప్రదం స్వర్గదం। సాయుజ్య ప్రదమేవవా తదపి యత్కించి ద్గయాపార్వణమ్ ॥ సాయాతాత్రిష్వథవా మహాసుఖకరీ దైవాచ్చ కర్తుర్మృతిః । స్యాదత్రైవహి ముక్తిదైనసహ తత్కర్తాపిత్రాణాం భవేత్ ॥

తా॥ గయయందు స్వల్పముగనైన పిండప్రదానము చేసినవాని పితృదేవతలకు షోడశ మహాదానాది కర్మలవలన గలిగెడి ఫలమును సంతుష్టియు స్వర్గంబును మోక్షంబును గలుగుననియు, గయాయాత్రవలన యపారమగు నానందములు గలుగజేయుననియు, దైవవశమువలన గయకు బోవుచుండగ మార్గమధ్యంబున దేహత్యాగము సంభవించినను గయయందు పిండదానము చేసినఫలము సంభవించును. గయాశ్రాద్ధఫలం సమాప్తమ్.

## * అథ సువాసినీత్వ నిర్ణయః. *

దక్షః ॥ శ్లో॥ అస్థిసంచయనాత్పూర్వం మృతాస్త్రీ యదివా పునః। తేనాగ్నినా దహేత్తౌతునవైధవ్యమితి స్త్రీయాః॥ దశాహమధ్యే యదివాస్థిసంచయ స్తదాపి మాతాప్రియతేసుతస్య। పుణ్యాంగనాం జ్ఞాప్య సువాసినీనాం సౌగంధ పుష్పాణ్యఖిలాని దద్యాత్ ॥ చితిభేదేన దాహశ్చ తత్కార్యాంశం పృథక్క్రియాః। భర్తుర్దశాహమధ్యేతు తద్భార్యాచ మృతాయది । సువాసినీతివిజ్ఞేయా పుణ్యస్త్రీ పూజనం క్రియాత్ ॥ ...సుమంతుః ॥ శ్లో॥ భర్తృసూతక ప్రాగస్థిచయనాత్పూర్వమేవవా । తద్భార్యాతు మృతా పూజ్య సానైసౌవాసినీభవేత్ ॥ ... అత్రసిద్ధాంతపక్షః ॥ శ్లో॥ అస్థిసంచయనాత్పూర్వం ప్రేతపత్నీ మృతింగతా । సువాసినీతి ఖ్యాతాపి వగం వైధవ్యమాప్నుయాత్ ॥ భర్తృసంచయనాత్పూర్వం భార్యాయది విపద్యతే । సువాసినీత్వం తస్యాస్థి అన్యథానిధనాభవేత్॥ స్వసమాప్తః.

## * అథ కర్తృ నిరూపణమ్. *

శ్లో॥ పుత్రః పౌత్రః ప్రపౌత్రశ్చ పుత్రికాపుత్ర ఏవచ। పత్నీభ్రాతాచ తత్పుత్రః పితామాతా స్నుషాతథా॥ భగినీభాగినేయశ్చ పిండగోత్రసహోర్యపి। పూర్వంపూర్వం పరఃకర్తా తదభావే పరఃపరః ॥

తా॥ పుత్రుఁడు, పౌత్రుఁడు, ప్రపౌత్రుఁడు, పుత్రికాపుత్రుఁడు, భార్య, భ్రాతయు, అతని పుత్రుఁడును, తండ్రియు, తల్లియు, కోడలును, చెల్లెలును, మేనల్లుఁడును, సపిండుఁడును, ధనహర్తయు వీరు పూర్వ పూర్వాభావమునం దుత్తరోత్తర కర్తృత్వముగలవారు.

మరీచిః॥ శ్లో॥ స్త్రీకర్త్రీ భర్తృకృత్యేషు పిత్రోః కర్మణ చోద్యది । దశాహాభ్యంతరే దైవాద్రజో దోషేణదూషితా ॥ తత్కర్మ వ్యర్థతామేతి సాస్నాత్వా పంచమేహని । నగ్నశ్రాద్ధం సమారభ్య పునః కర్మసమారభేత్ ॥

తా॥ భర్తయొక్క ప్రేతకృత్యంబులయందు భార్యయే కర్తయైయుండి పదిదినములలోపల రజోదోషితురాలయ్యేనేని అదివఱకు చేసిన కర్మయంతయును వ్యర్థమగును. కావున పంచమదినమునందు స్నానంబుజేసి నగ్నశ్రాద్ధంబును ప్రారంభించి మఱల కర్మను జేయవలయునని మరీచి వచించెను

శ్లో॥ జ్యేష్ఠోవాఽథ కనిష్ఠోవా జ్యేష్ఠభార్యాసుతోదహేత్ । అగ్నికార్యే ప్రధానత్వాత్ జ్యేష్ఠభార్యాసుతోఽగజః॥ అనేకపత్నీ పుత్రాణాం యస్తు జ్యేష్ఠస్స ఏవహి । పితుస్సపిండీకరణం కుర్యాదిత్యహ కాశ్యపః ॥

తా॥ జ్యేష్ఠుఁడైనను, కనిష్ఠుఁడైనను జ్యేష్ఠభార్యాసుతుఁడు అగ్నికార్యమునందుఁ ప్రధానుఁడు అనేకపత్నులయొక్క పుత్రులలో జ్యేష్ఠపుత్రుఁడు తండ్రికి సపిండీకరణమును జేయవలయునని కాశ్యపుఁడు వచియించెను.

శ్లో॥ ఔరసః క్షేత్రజశ్చైవ పుత్రికాపుత్ర ఏవచ। భ్రాతావా భ్రాతృపుత్రోవా సపిండీకరణంచరేత్ ॥ అత్ర భ్రాతా కేవల సోదరః । **ఏషామభావే పత్నీచ ధనహోత్యపివా భవేత్ ॥**

**కేచిత్**॥ శ్లో॥ పుత్రాభావేతు పత్నీస్యాత్పత్న్యభావేతు సోదరః । పత్న్యభావేతు సాపత్న్యః పుత్రఏవ నియుజ్యతే । తదభావేతు తత్పుత్రః ఆసన్నో న్యస్తతః పరం । ఆద్యశ్రాద్ధ మశుద్ధోపి కుర్యాదేకాదశేహని ॥

తా॥ ఔరసపుత్రుఁడు లేనప్పుడు క్షేత్రజాతులును, పుత్రిక యును పుత్రికాపుత్రుఁడును, సోదరుఁడును, తత్పుత్రుఁడును సపిండీకర ణమును జేయవలయును. వీరు లేనప్పుడు భార్యయును, ధనహర్త యును జేయవచ్చును. కొంతమంది పుత్రాభావమందు పత్నియ నిన్ని, పత్ని అభావమందు సోదరుఁడును- అట్లుగాక భార్యా భావ మందు సవతితల్లియును, ఆమె లేనప్పుడు ఆమె పుత్రుఁడును, వీరు లే నప్పుడు వీరి పుత్రుఁడును, పిమ్మట దగ్గఱ సంబంధులును కర్తృత్వము గలవారు ఆద్యశ్రాద్ధము ౧౧ వ దినమునందు జేయవలెను. ఇందు వలన కర్తకు శుద్ధిగలదు. తక్కిన విషయములు ధర్మశాస్త్రముల యందు జూడఁదగును; గ్రంథవిస్తరభీతిచే వ్రాయనైతిని.

ఇతి కర్తృనిరూపణం సమాప్తమ్.

* అథ కర్తృ భార్యా రజస్వలా విషయః *

శ్లో॥ ఏకాదశేహ్ని సంప్రాప్తె కర్తృభార్యా రజస్వలా। ఆద్యశ్రాద్ధం ప్రకుర్వీత ఊనాద్యాది విసర్జయేత్ । శ్రాద్ధకర్తుర్యదా భార్యా ఆశౌచాంతే రజస్వలా ॥ శ్రాద్ధశేషం ప్రకుర్వీత వర్జయిత్వా సపిండనమితి ॥ శ్రాద్ధశేషం ప్రకుర్వీత్యనేనవాక్యేన ఏకాదశేహని విహిత మాద్యమాసికం రుద్రగణాఖ్యశ్రాద్ధం వృషోత్సర్జనాఖ్యశ్రాద్ధంచ కుర్యాత్ ॥ వర్జయిత్వా సపిండనమితి తదర్థ మపకృష్య పంచ దశైకోద్దిష్టశ్రాద్ధాని వర్జయేత్॥ కేచిత్పంచమదినే శుద్ధింసంపాద్య । ఆద్యాది షోడశైకోద్దిష్టశ్రాద్ధం సపిండీకరణశ్రాద్ధం కుర్యుః ॥

తా॥ పదనొకండవ దినము సంప్రాప్తమగుచుండఁగా కర్త యొక్క భార్య రజస్వలయ్యేనేని ఆద్యశ్రాద్ధంబును జేయవలయును. ఊనాద్యాదులను వదలయును. శ్రాద్ధకర్తయొక్క భార్య ఆశౌ చాంతమునందు రజస్వలయ్యేనేని సపిండనమును వదలి శ్రాద్ధ శేష మును జేయవలయును. అనఁగా ౧౧ వ దినమునందు శాస్త్రోక్త ప్రకారముగ జేయఁదగిన పుణ్యాహవాచనము, ఆహ్నికము, రుద్ర గణాఖ్య శ్రాద్ధము, వృషోత్సర్జనాంగ శ్రాద్ధంబును జేయవలెను. షోడశశ్రాద్ధములలో ఆద్యశ్రాద్ధముతప్ప పంచదశైకోద్దిష్ట శ్రా ద్ధము మాత్రము వదలవలెను. కొందఱు ఆద్యశ్రాద్ధము గూడ

భార్యరజస్వలయైన నైదవదినంబున స్నానముచేసినపిమ్మట ఆద్యాది షోడశైకోద్దిష్టశ్రాద్ధము సపిండీకరణశ్రాద్ధము ఒకదినమునందే ఆచరింపుచున్నారు. తక్కిన విషయములు దేశాచారములనుబట్టి జఱుపవలయును.

ఇతి కర్తృ భార్యా రజస్వలా విషయ స్సమాప్తః.

* ఏ కా ద శా హ ది నం బు న జ్ఞా త్యా శౌ చ మ్ *

కాలామృతే॥ శ్లో॥ త్యక్త్వా బాంధవసూతకేతు సకలం చాద్యాది పశ్చాచ్చరే। తాత్కార్యంతర్లఘు సూతకేతువిహితం చాద్యాదియచ్చోదితమ్। సాపిండ్యార్థ మథాపకృష్యమఖిలం శ్రాద్ధం పరిత్యజ్యత। త్సాపిండ్యాద్విహితోద కుంభమథవా ప్యాసంచ పశ్చాచ్చరేత్॥

తా॥ దశాహదినమునైనను, ఏకాదశాహ దినమునైనను జ్ఞాతిసంబంధ దశరాత్రాశౌచము సంభవించెనేని ౧౧ వ దినంబున నేకాదశాహ శ్రాద్ధముచేసి ఆశౌచము నివృత్తియైన పిమ్మట తక్కిన కృత్యముల జేయవలయుననియు, త్రిరాత్రాశౌచము సంభవించెనేని అద్యైకాదశాహ శ్రాద్ధముతోడ నప్పుడు చేయఁదగిన అన్ని శ్రాద్ధములు జేయవచ్చుననియు ౧౨ వ దినంబున సపిండీకరణము చేయనిచ్ఛగల పురుషుఁడాదినంబున చేయఁదగిన సోదకుంభశ్రాద్ధమును వదలి తక్కిన ౧౫ వ ఏకోద్దిష్టశ్రాద్ధమునందుచేర్చి ౧౧వ దినంబున చేయవలెను. సపిండీకరణంబైన పిమ్మట మఱల నాయాకాలములందు ఊనాది మాసశ్రాద్ధములను తక్కిన సోదకుంభశ్రాద్ధములను జేయవలయును.

వా॥ మధ్యే ప్రత్యాబ్దికే ప్రాప్తే ఏకాదశేహని ఆద్యాదీని శ్రాద్ధాదీని కృత్వా। తదహరేవ ప్రత్యాబ్దికం కుర్యాత్॥ ఇతి బ్రాహ్మణవిషయః॥ క్షత్రియ వైశ్యశూద్రాణాం శుద్ధిదినే కర్తవ్యం॥

తా॥ ఆశౌచ దినంబుల లోపల శ్రాద్ధంబు సంభవించిన యెడల పదునొకండవ దినమునందు ప్రత్యాబ్దిక శ్రాద్ధమును జేయవలెను. ఇది బ్రాహ్మణవిషయము, క్షత్రియులకు శుద్ధి ౧౩ వ దినమునందును, వైశ్యులకు ౧౬ వ దినమునందును, శూద్రులకు

న్యాయవిధి ప్రకారము ౩౦ వ దినమునందును శుద్ధిగలదు. కొన్ని స్మృతులలో "త్రింశద్దినాని శూద్రస్య తదర్థం న్యాయవర్తినః" అని చెప్పియుండెను. కాఁబట్టి దేశాచారప్రకారము ౧౫ వ దినమువఱకు ఆశౌచము నవలంబించి ౧౬ వ దినంబున శుద్ధిస్నానముచేసి పిమ్మట ఆబ్దికము జఱుపవలయును.

* త్రైపక్షికాది శ్రాద్ధకాలః *

తిథిదర్పణే ॥ శ్లో॥ కుర్యాత్త్రైపక్షికం శ్రాద్ధం త్రిపక్షే విషమేహని । అపరః ॥ త్రిపక్షే ద్వాదశేపక్షే చతుర్వింశతిపక్షకే । పక్షత్రిపంచకం కృత్వా ఆది మధ్యాంత్య పంచకే ॥

తా॥ త్రైపక్షిక శ్రాద్ధమును మూఁడవపక్షములో విషమ దినమందు జేయవలయునని తిథిదర్పణమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మూఁడపపక్షంబున నాదియందు ౧౦ దినములకు పిమ్మట ౫ దినములలో నొకదినంబున త్రైపక్షిక శ్రాద్ధము చేయవలెను. అనఁగా మృతదినమునకు ౪౦ రోజులకు పిమ్మట ౪౫ దినములకు లోగా- అట్లుగాక కొందరు ఒకనెలమీఁద అయిదు దినముల లోఁగా జరుపుచున్నారు. ఆఱవమాసమున యిఱువది దినములు మొదలు యిరువది ఐదుదినములకులోపుగా శుద్ధిగల యొకదినంబున ఊనషాణ్మాసికంబును, పండ్రెండవ మాసంబున యిరువది ఐదు దినములకు పైనొక శుద్ధిగలదినమునందు ఊనాబ్దిక శ్రాద్ధంబును జేయవలెను.

* ఊనత్రయములకు నిషిద్ధకాలములు *

కాలామృతే ॥ శ్లో॥ నందాదర్శ చతుర్దశీ భృగుశని ష్వగ్నిద్విత్రి పూర్వాసురే । పూనాన్యే ననహిత్రి పుష్కరదినే ష్వన్యేష్వ పజ్యేష్వపి ॥ కుర్యాదుత్తరమాసికేవసహ తద్షాణ్మాసికం చాబ్దికం । న త్రైపక్షిక మూనకర్మచ తథా పశ్చాచరేద్దేవతత్ ॥

తా॥ పాడ్యమి, షష్ఠి, ఏకాదశి, యీ నందతిథులును, అమావాస్యయు, ఉభయపక్ష చతుర్దశీ తిథులును శుక్రశనివారంబులును కృత్తిక- పూఫ- పూషా- పూభా- మూల- ద్విపాత్త్రిపాన్నక్షత్రంబులును, పూర్వము తిథ్యాది శాంతిప్రకరణమునందు యీ గ్రంథములలో వ్రాయఁబడిన త్రిపుష్కర దినంబులును ఊనత్రయమునకు

నిషిద్ధంబులనియు, ప్రతిమాసంబున జేయవలసిన మాసికములు అనుపపత్తిచేత నిలిచియున్న యెడల ఆమాసికములు పై మాసికముతో జేర్చి చేయవచ్చుననియు, ఊన త్రైపక్షిక మాసికము లట్లు చేయగూడదు.

శ్లో॥ త్రైపక్షికోనషాణ్మాసికోనాబ్దిక మథాచరేత్ । ఏతేషా మన్యకాలేతు నపునః కరణం స్మృతమ్ ॥

తా॥ త్రైపక్షికోన షాణ్మాసికోనాబ్దిక శ్రాద్ధములనుట యీ శ్రాద్ధములకు విద్యుక్తకాల మతిక్రమించకమునుపే జేయవలయును గాని అతిక్రమించినపిమ్మట జేయఁగూడదని యభిప్రాయము. విశ్వాదర్శమునందును నీయర్థమే ప్రతిపాదింపఁబడినది

స్మృత్యంతరే ॥ శ్లో॥ గణశః క్రియమాణేతు మాసికే ష్వనుభావిషు । త్రీణిస్యురర్ఘ్యపాత్రాణి పిండాః త్రీన్యేవనిర్వపేత్ ॥

తా॥ అనేకములగు మాసికముల నొక్కటూరి చేయు నెడల అర్ఘ్యపాత్ర పిండములు మూఁడేసి యేయని యెఱుఁగవలెను.

వ్యాసః ॥ శ్లో॥ నాసపిండీకృతే ప్రేతే పితృత్వ ముపపద్యతే । అకృతస్యతుపుత్రస్య శుభం కించిన్నవిద్యతే । నచనైమిత్తికంకామ్య మిష్టాపూర్తాదికంచన నా సపిండీకృతేపిత్రో రన్యేషాంశ్రాద్ధమేవచ॥

తా॥ సపిండీకరణము చేయనియెడల ప్రేతత్వము విడిచిపోదు. చేయని పుత్రునకు శుభము కొంచెమైనను లేదు. తల్లి దండ్రులకు సపిండీకరణమును జేయకిమునుపు యితరులకు శ్రాద్ధములను జేయఁగూడదని వ్యాసుఁడు వచియించెను.

ఇతి త్రైపక్షికాది శ్రాద్ధకాలా స్సమాప్తాః.

* అథ స్నానోదక నిర్ణయః. *

శ్లో॥ మృతౌజన్మని సంక్రాంతౌ శ్రాద్ధే పర్వణిపర్వణి । అస్పృశ్య స్పర్శనేచైవ నస్నాయాదుష్ణవారిణా । జాసన్ననా పదితదా య స్స్నాయా దుష్ణవారిణా । సగోహత్యాకృతం పాపం ప్రాప్నోత్యేవ నసంశయః ॥ (తాశ్చాపో నద్యాది తీర్థేషు పవిత్రతమాః ॥ అలాభే మంత్రిపూతా, ఇః॥ )

తా॥ జనన మరణములయందును, సంక్రమణమునందును, శ్రాద్ధములనందును, దర్శ మొదలగు పర్వములయందును, అస్పృశ్య స్ప

ర్ణయందును ఉష్ణోదకముచేత స్నానమును జేయఁగూడదు. రోగ
హీంతుడై యుండియు నీకార్యములయం దుష్ణోదకముచేత స్నానముఁ
జేయువాఁడు గోహత్యకుఁ దుల్యమైన పాపమును జేసిన వాఁడగును.
నద్యాది తీర్థములయందు స్నానముజేయుటయుత్తమము. అవిలభిం
చనియెడల మంత్రపూతోదకములచే స్నానము జేయవలయును.

ఇతి స్నానోదకనిర్ణయః.

* జీవత్పితృనకశ్రాద్ధనిషేధమ్ *

తండ్రి జీవించియున్న ఇతరులగు జ్ఞాతులుమాత్రము తిలోదా
దుల నీయఁగూడదు. జ్ఞాతులతోఁగూడ నాశౌచ దినంబుల యందు
సహవాసంబును జేయఁగూడదు. తండ్రి బ్రతికియున్నను తల్లి శ్రా
ద్ధము మాత్రము యథావిధిగా వారి వారి కులాచారములను బట్టి
తప్పక చేయవలెను. తండ్రి జీవించియుండఁగా జ్యేష్ఠభ్రాతయైనను
కనిష్ఠభ్రాతయైనను మృతినొందినయెడల తిలోదకాది ప్రేతకృత్యము
లన్నిటిని తన తండ్రియే చేయవలెను. కర్తృత్వము వహించినను
తల్లిదండ్రుల కాయుర్వృద్ధినిగోరు పుత్రుఁడు ప్రేత కృత్యంబులను
జేయఁగూడదని తెలియవలయును. ఇతి శ్రాద్ధనిషేధ స్సమాప్తః.

* అథ తిలతర్పణనిషేధః *

స్మృతిసార సంగ్రహే॥ శ్లో॥ తీర్థశ్రాద్ధే గయాశ్రాద్ధే ప్రేత
శ్రాద్ధేనుమాసికే । సపిండీకరణేచైవ నకుర్యాత్తిలతర్పణమ్ ॥ వృద్ధి
శ్రాద్ధే పిండ్యాంచ మాసికే చానుమాసికే । అబ్దికే ప్రథమేచైవ
నకుర్యాత్తిలతర్పణమ్॥ దర్శే తిలోదకంపూర్వం పశ్చాద్దద్యా న్మహా
లయే । ప్రత్యబ్దేనా పరంపూర్వం పరేహని తిలోదకమ్ ॥ ప్రత్యబ్దాం
గం తిలందద్యా న్నిషిద్ధేపి పరేహని । వర్గైకస్య వచోయేషామ న్యే
షాంతు విసర్జయేత్ ॥

తా॥ తీర్థ శ్రాద్ధమునందును, గయా శ్రాద్ధమునందును,
ప్రేత శ్రాద్ధమునందును, అనుమాసిక శ్రాద్ధమునందును, ప్రథ
మాబ్దిక శ్రాద్ధమునందును, సపిండకరణ శ్రాద్ధమునందును, వృద్ధి
శ్రాద్ధమునందును, సాపిండ్యమునందును, మాసిక అనుమాసికము

నందును తిలతర్పణమును జేయఁగూడదు. దర్శ శ్రాద్ధమునందు శ్రాద్ధకర్మాచరణమునకు ముందుగాను మహాలయ శ్రాద్ధమునందు పిమ్మటను తిలతర్పణమును జేయవలయును. ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందు సద్యస్కాలమునందే తిలతర్పణమును జేయగూడదు. పరదిన ప్రాతఃకాలమునందు తిలతర్పణమును జేయవలయును. పరదిన మందు తిలతర్పణము జేయుటకు నిషిద్ధమైనను తిలతర్పణమును జేసియే తీరవలయును. శ్రాద్ధమునందలి వర్గత్రయమునకే తిలతర్పణమును జేయవలయునుగాని యితరులకు తిలతర్పణమును జేయఁగూడదు.

స్మృత్యంతరే॥ శ్లో॥ సజీవ పితృకః కుర్యాచ్ఛ్రాద్ధాంగ తిల తర్పణం । శ్రాద్ధామాత్రం ప్రకుర్వీత తర్పణంతు పితాచరేత్ ॥

తా॥ జీవపితరులుగలవాఁడు శ్రాద్ధంబును మాత్రంబొనర్ప వలయునుగాని శ్రాద్ధాంగ తిలతర్పణము జేయఁగూడదు, ఆ తర్ప ణంబును తండ్రి చేయవలయునని స్మృతికారులు వచించిరి. అనఁగా తన తండ్రి జీవించియుండఁగా కుమారుఁడు తన తల్లి శ్రాద్ధమును జేసి తర్పణము మాత్రము తండ్రి చేయవలెననుట.

ఇతి తిలతర్పణనిషేధస్సమాప్తః.

* దర్శే తిలతర్పణ ఫలమ్. *

శ్రీభారతే అనుశాసనికపర్వణి శతోత్తర పంచవింశాధ్యాయే॥ పితర ఊచుః ॥ శ్లో॥ అమావాస్యాంతు యేమర్త్యాః ప్రయచ్ఛంతి తిలోదకం । కృతం భవతితై శ్రాద్ధం సరహస్యం యదార్థవిత్ ॥ హృ ష్టపుష్ట మనాస్తేషాం ప్రజాభవతి నిత్యశః । కులవంశస్య వృద్ధిరస్తు పిండదస్య ఫలంలభేత్ । శ్రద్ధాయుతస్తు యఃకుర్యా త్పితౄణా మనృ ణోభవేత్ ॥

తా॥ పితృదేవతలు చెప్పుచున్నారు. ఏ మనుజులైనా అమావాస్యా దినమునందు మధుమిశ్రమగు ఔదుంబరపాత్రలో తిలో దకము పితరుల నుద్దేశ్యముగా యిచ్చునెడల వారలు యదార్గజ్ఞానము కలవారు ధర్మపు రహస్య మెఱిఁగినవారుగా నుందురు వారలకు హృష్టపుష్టలుగా నుండు సంతానము ముక్తి ప్రదమైనదై యుండును. కులము వంశము యభివృద్ధియగును. పిండదానము చేసిన ఫలము

లభించును. శ్రద్ధతో తిలతర్పణము జేయువాఁడు పితృఋణములో నుండి ముక్తుఁడు కాఁగలఁడు.

కించ॥ అనుశాసనికపర్వణి శతోత్తరషడ్వింశధ్యాయే॥ దేవా ఊచుః ॥ శ్లో॥ బలిం భిక్షాం తథార్ఘ్యంచ పితౄణాంచ తిలోదకం। తామ్రపాత్రేణ దాతవ్య మన్యథాల్పఫలం భవేత్ । గుహ్యామే తత్స ముద్దిష్టం యథాతుష్యంతి దేవతాః ॥

తా॥ దేవతలు చెప్పుచున్నారు. బలిప్రదానము, భిక్షమొసఁగుట, అర్ఘ్యమిచ్చుట, పితరులనుద్దేశ్యముగా తిలోదకమిచ్చుట, అవి యావత్తు తామ్రపాత్రంబున జఱుపవలెను. లేనియెడల అల్పఫలము కలుగును. ఏకార్యముచే దేవతలు సంతసింతురో ఆ రహస్యమును జెప్పఁబడెను. మాతా పితరుల శ్రాద్ధదినములలో బ్రహ్మయజ్ఞ-నిత్యతర్పణములను శ్రాద్ధాత్పూర్వమునందే కొందఱును, శ్రాద్ధాత్పరమునందు కొందఱును ఆచరింపుచున్నారు. వానిలో సమీచి సమేదని శోధింపఁగా శాఖాభేదములచేత ఆయాచారభేదములు కలవు.

శ్లో॥ ఆదౌ నైమిత్తికంకుర్యా త్పశ్చాన్నిత్యం సమాచరేత్॥

అను ప్రమాణము ననుసరించి ఋక్శాఖలు శ్రాద్ధానంతరమే బ్రహ్మయజ్ఞ- నిత్యతర్పణములు జఱిగించుటయును, యజుశ్శాఖలు శ్రాద్ధాత్పూర్వమునందే ఆచరించుటయునుగలదు.

ఇతి దర్శే తిలతర్పణఫలం సమాప్తమ్.

* కర్త్రా తాంబూలచర్వణమ్. *

ప్రయోగపారిజాతే ॥ శ్లో॥ పక్షశ్రాద్ధే తథాదర్శే యుగమన్వంతరాదిషు । శ్రాద్ధం నిర్వర్త్యభుక్త్వాతు తాంబూలం ఖాదయే ద్విజః ॥ మోహాద కృత్వాయ శ్శ్రాద్ధం తాంబూలం యదిఖాదయేత్ । శ్రాద్ధహంతా భవేత్కర్తా రౌరవం నరకంవ్రజేత్॥ వా॥ పితౄః ప్రత్యాబ్ధికే శ్రాద్ధే దివారాత్రౌ తాంబూల చర్వణం నిషిద్ధమ్ ॥ అంగతిలతర్పణస్య పరేద్యుః ప్రాతర్విహితత్వేన సాంగపితృ కర్మాని వృత్తేః ॥

తా॥ పక్ష దర్శ యుగ మన్వంతరాదులయందు శ్రాద్ధకర్మ నాచరించ పిడప తాంబూల చర్వణాదికమును జేయవనయును. ఒక

వేళ శ్రాద్ధము నాచరింపక తాంబూలచర్వణాదికమును జేసెనేని రౌరవావాది నరకములనుబొందును. తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధములయందు పరదిన ప్రాతః కాలమునందు తిలతర్పణము జేయువఱకు తాంబూలచర్వణాదికమును జేయఁగూడదు.

శ్లో॥ మృతాశౌచే తథాశ్రాద్ధే మాతాపిత్రో ర్మృతేహని ।
ఉపవాసేచ తాంబూలం దివారాత్రౌ విసర్జయేత్ ॥

తా॥ మృతాశౌచమునందును, శ్రాద్ధదివసమునందును, తల్లి దండ్రులయొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందును, ఉపవాస వ్రతదినములయందును తాంబూల చర్వణంబును జేయఁగూడదు.

శ్రాద్ధదర్పణే ॥ శ్లో॥ భక్ష్యంచ పిండనైవేద్యం వికిరాన్నంచ స్పర్శనం । తాంబూల చర్వణం కృత్వా పునశ్శ్రాద్ధం సమాచరేత్ ॥

తా॥ మాషముతోవండిన భక్ష్యమును పిండనైవేద్యము జేసినను వికిరాన్నము భోజనపాత్రకు స్పర్శతగిలినను, కర్త తాంబూలము భక్షించినను తిరిగి శ్రాద్ధము చేయవలయునని శ్రాద్ధదర్పణము ఘోషింపుచుండెను. ఇతి తాంబూలచర్వణం సమాప్తమ్.

* మాతుర్దశామధ్యంబు పితృమృతి *

స్మృత్యంతరే ॥ శ్లో॥ మాతుర్దశాహ మధ్యేతు పితాయస్య ప్రమీయతే । పైతృకంతు యథాకాలం పితుస్సర్వం సమాపయేత్ । తతో మాతుస్త్రీ ఃషాదా శేషం కర్మసమాపయేత్ ॥

తా॥ తల్లి మృతిబొందిన దశాహమధ్య తండ్రిమృతిఁబొందిన యెడల తండ్రికి శ్రాద్ధము సంపూర్తిచేసి పిమ్మట 3 వ పక్షములో ఆదియందు అనఁగా పదిదినములకు పిమ్మట అయిదు దినములలో తల్లికి లోగడచేసిన క్రియలుగాక తక్కిన శ్రాద్ధమంతయు సమాప్తిఁ జేయవలయును.

శ్లో॥ మాతుర్దశాహ మధ్యేతు మృతశ్చే ద్యదివైపితా । పితుర్మరణ మారభ్య దశాహం సూతకం భవేత్ ॥

తా॥ తల్లి దశాహమధ్యమందు తండ్రి మృతినొందిన యెడల మృతిబొందినది మొదలు ౧౦ దినములు సూతకము.

ధర్మప్రవృత్తౌ ॥ శ్లో॥ మాతాపిత్రోర్యథాశౌచం దశాహం విహితంబుధైః । పైతృకాదూర్ధ్వమేవస్యాన్మాత్రాశౌచంతుపక్షిణి॥

తా॥ తల్లి తండ్రి మొదలగువారి మృతులయందు ౧౦ దినములాశౌచము. తండ్రియొక్క శ్రాద్ధము చేయుచుండఁగా ఊర్ధ్వభాగమునందు తల్లిచనిపోయినయెడల మాత్రాశౌచము ఒకటిన్నరదినము.

శ్లో॥ ఆద్యశ్రాద్ధ మశుద్ధోపి కుర్యాదైకాదశేహని । కర్తుస్తాత్కాలికాశుద్ధి రశుద్ధిః పునరేవసః ॥

తా॥ ఆద్యశ్రాద్ధంబును అపరిశుద్ధుఁడై చేయవలెను. ఈ శ్రాద్ధముజేయుటవలన కర్తకు తత్కాలంబునందు పరిశోధ్ధి గలుగును.

శ్లో॥ పితురాశౌచమధ్యేచే న్మాతుశ్శ్రాద్ధం పతేద్యది । రుద్రాహే షోడశాత్పశ్చా న్మాతుశ్శ్రాద్ధం విధీయతే ॥ మాతురాశౌచమధ్యేచేత్పితుశ్శ్రాద్ధం పతేద్యది । రుద్రాహే షోడశాదర్వాక్తచ్ఛ్రాద్ధంతు విధీయతే ॥ ఇతి ఆశౌచనిండే శాతాతపః ॥

అస్యార్థః ॥ ఏకాదశాహే పితుః షోడశాది శ్రాద్ధం కృత్వా ॥ తతః మాతుః ప్రత్యాబ్దికం కర్తవ్యం ఏకాదశాహే ఆద్యశ్రాద్ధం నిర్వర్త్య ॥ పితుః మృతాహశ్రాద్ధం కృత్వా అథ ఆద్యాది షోడశశ్రాద్ధాని కారయేదిత్యర్థం॥ మాతుర్దశాహమధ్యే పితృమృతిసమాప్తః

* అధికమాసప్రకరణమ్. *

అధికమాసములో మృతిఁబొందినవానికి తిరిగి ఆమాసము యెప్పుడైనా అధికమాసము వచ్చినయెడల ఆమాసమునందే ప్రత్యాబ్దికము. శుద్ధ మాసములో జేయనక్కరలేదు. శుద్ధమాసమునందు మృతులైనవారికైతే అధికమాసమునందు అవసరములేదు. మాసికములు మాత్రము అధికమాసమునందుగూడ శ్రాద్ధముచేయవలెను. అధికమాసములో మృతులైనవారికి నిజమాసములో మృతతిథియందు అన్వాద్యశ్రాద్ధముచేసి అక్కడనుంచి ౨౮ వ దినమందు ఊనమాసికము పెట్టి అదిమొదలు ముప్పదవ దినమందు ద్వితీయ మాసికము పెట్టి, అక్కడనుంచి ౧౫ దినములలోగా ఆదిపంచకమునందు త్రైపక్షికశ్రాద్ధముచేసి క్రమముగా సంవత్సరాంతము జరిగించవలెను. సంవత్సరముమధ్య అధికమాసము సంభవించే యెడల శుద్ధాధికములకు

కవలే సంకల్పముచేసి అధికమాసమందే శ్రాద్ధము పెట్టవలయును సంవత్సరాంతమందు అధికము వచ్చేపక్షమున ఊనాబ్దికమును, సంవత్సర విమోకమును, ఆబ్దికమును ఈ మూడును అధికమాసములోనే పెట్టవలయునుగాని శుద్ధమాసంబున నాచరింపఁగూడదు. మధ్యాధికమువచ్చిన ప్రథమాబ్దికానికి లోగడమాసానికే ౩౬౦ దినములగును కనుక లోగడ మాసములో ఊనాబ్దిక విమోకములు జరిగించవలెననే మాట యుక్తముగాదు. ఆ రెండుమాసములు ౩౦ దినముల సంజ్ఞ కనుక ప్రథమాబ్దికముతో కూడానే జరిగించవలయును. శుద్ధమాసమునందు మృతులైనవారికి ప్రథమాబ్దికము మలమాసమందు వచ్చినచో నప్పుడే చేయవలయును ద్వితీయాబ్దికాదులు మాత్రము శుద్ధమాసమునందే జరుపవలెను.

కించ.॥ గర్గః ॥ శ్లో॥ అగ్న్యాధానం ప్రతిష్ఠాంభ యజ్ఞ దాన వ్రతానిచ । దేవవ్రత వృషోత్సర్గ చూడాకరణ మేఖలాః ॥ గమనం దేవతీర్థానాం వివాహమభిషేచనం । యానంచ గృహకర్మాణి మల మాసే వివర్జయేత్ ॥

తా॥ అగ్న్యాధానం, ప్రతిష్ఠ, యజ్ఞదాన వ్రతములు, దేవవ్రతములు, కామ్య వృషోత్సర్గము, చూడాకరణము, మేఖల, దేవక్షేత్ర తీర్థాటనము, వివాహము, అభిషేచనము, యాచనము, గృహకర్మలు అనువానిని మలమాసమునందు విడువవలెనని గర్గుఁడు చెప్పె.

శ్లో॥ అవశ్య కర్మమాసాఖ్యం మలమాసమృతాబ్దికం । తీర్థేభచ్ఛాయయోశ్శ్రాద్ధం మఖకర్మ పితృక్రియాః ॥ కుర్యాన్మలిమ్లుచే వర్షమధ్యేచేత్స తదాధికం । తత్రస్యాన్మాసికం మృత్యో మాసాత్స ద్వాదశోయది ॥ ప్రేతక్రియా సమాప్యాత్ర కుర్వీతాభ్యుదయంతథా। శ్యామాకాగ్రయణం కృచ్ఛ్రత్రయ వర్జమతోన్యథా ॥

తా॥ మలమాసమునందు అవశ్యముగా జేయఁదగినమాసికాది కర్మలును, ఆబ్దికములను, తీర్థ శ్రాద్ధములను, యజ్ఞకర్మములను, పితృక్రియల్లను చేయవచ్చునని యెఱుఁగవలయును. మఱియును వర్షమధ్యమందుమలమాసమువచ్చేనేని అప్పుడధికమాసములు గ్రహించవలయును. మలమాసము మొదలుకొని పదిరెండవమాసము మల

మాసమయ్యేనేని దానియందు ప్రేతకర్మలను సమాప్తిని బొందించి పిమ్మట అభ్యుదయ కర్మములను జేయవలయునని సూర్యోదయమను గ్రంథమునందు జెప్పఁబడియె.

కించ॥ శ్లో॥ కామ్యారంభం వృషోత్సర్గం పర్వోత్సవ ముపా కృతిం । మేఖలా చౌలమాంగల్యా ఒగ్న్యాధానోద్యాపన క్రియా ॥ వేదవ్రత మహాదానా ఒభిషేకా స్వధిమాసికం । ఇష్టం పూర్తం తథాయస్య విద్యలోపో న్యథాకృతౌ । తత్సర్వ మష్ట కాదన్య దధి మాసేవివర్జయేత్ । సూతకేపిచకర్తవ్యం స్నానాద్యం రాహుదర్శనే ॥

తా॥ కామ్యారంభము, వృషోత్సర్గము, పర్వోత్సవము, ఉపా కర్మము, మేఖలము, చౌలము, మాంగల్యము, అగ్న్యాధానము, ఉద్యాపనక్రియ, వేదవ్రతము, మహాదానము, అభిషేకము అనువానిని అధికమాసమునందు విడువవలయును, గ్రహణకాలమునందు జనన మరణాశౌచములు గలిగియున్నప్పటికిని గ్రహణప్రయుక్త స్నానాదికమును జేయవలయుననియును సూర్యోదయ మను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మరియును,

శ్లో॥ గర్భవార్ధుషికే భృత్యే ప్రేతకర్మణి మాసికే । సపిండీ కరణే నిత్యే నాధిమాసంతు వర్జయేత్ ॥

తా॥ గర్భమునందును, వడ్డి యందును, భృత్యుని యందును, ప్రేతకర్మమునందును, మాసికమునందును, సపిండీకరణము నందును, అధికమాసము విడువవలనుపడదని పరాశరస్మృతియందుఁ జెప్పఁబడె.

గ్రంథాంతరే॥ శ్లో॥ మాసద్వయేబ్ద మధ్యేచ సంక్రమోన భవేద్యదా । ప్రాకృత స్తత్రపూర్వస్స్యా దుత్తరస్తు మలిమ్లుచః॥

తా॥ సంవతర మధ్యమందు రెండధికమాసములు తటస్థించెనేని మొదటిమాసమును ప్రాకృతమాసమునుగాను, రెండవమాసమునుమలిమ్లుచః- అధికమాసముగాను గ్రహింపవలయునని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడియె. అధికమాస ప్రకరణం సమాప్తమ్.

* ప్రేత శ వా ను గ మ నే ని య మః *

శ్లో॥ ప్రేతస్య పార్శ్వయోరగ్రే నగచ్ఛేయుః కదాచన । తస్మాదగ్రేతు గంతౄణా మాయుఃక్షీణం పదేపదే॥ మృతస్య పశ్చాద్గమనే

ప్రాయశ్చిత్తం విధీయతే । కిల్బిషాదగ్రగమనే నిష్కృతిర్నోప పద్యతే ॥ఇతి దోషశ్రవణాత్ స్మృత్యంతరే విశేషః ॥ శ్లో॥ సంస్కారోప క్రమాత్పూర్వం కామం స్నాత్వా విశుధ్యతి । ప్రారబ్ధేపిహి సంస్కారే సమాప్తే స్నానమాచరేత్ ॥ ఏతదన్యవిషయం॥ ఆరంభాత్ప్రాక్ప్రరస్నాయాత్తస్య శుద్ధిర్భవిష్యతి ॥

తా॥ ప్రేతమునకు పార్శ్వమునందుగాని, పశ్చాద్భాగంబునందుగాని పోవలయును. అట్లుగాక ప్రేతమునకు ముందుభాగమునందు నడచినయెడల ఆయువు క్షీణించిపోవునని యభిప్రాయము. పార్శ్వ పశ్చాద్భాగంబులయందు నడచినవానికి ప్రాయశ్చిత్తముగలదు అగ్రభాగమునందు నడచినవానికి ప్రాయశ్చిత్తములేదు. కావున నగ్రభాగమందు బోఁగూడదని యభిప్రాయము, దహనసంస్కారంబుల నుపక్రమించుటకు మునుపు స్నానంబుజేసినయెడల పరిశుద్ధి గలుగును. దహన సంస్కారంబుల నుపక్రమించినపిమ్మట దహన మగువఱకును స్నానంబుచేసినయెడల శుద్ధిగలుగదు. కావున సగోత్రుఁడు సంస్కారంబు నుపక్రమించుటకు పూర్వంబునందు స్నానంబునుజేయవలయునని స్మృత్యంతర వచనాభిప్రాయము.

ఇతి శవానుగమనే నియమస్సమాప్తః.

* శ్మ శా నే ప్రే త పు న ర్జీ వః *

శ్మశానంబునకు ప్రేతమును తీసికొనిపోయిన పిమ్మట నా శవమునకు ప్రాణంబులు వచ్చినయెడల మఱల నామనుఁడు గృహమునకు వచ్చునేని యాగృహంబునకుఁ గీడువాటిల్లును. కావున నాకీఁడు దొలగిపోవుటకొఱకు క్షీరమిశ్రిత సమిధశ్శతమును, ఆజ్యంబును, హోమమును జేయవలెను. బ్రాహ్మణులకు గోదానాది మహాదానములు జేసి సావిత్ర్యష్ట శతంబులచేత క్షీరంబులతో శాంతినిజేయవలయును. కపిలధేనువును, తిలలను, సువర్ణమును, వస్త్రమును ఆయుర్వృద్ధికొఱకు కర్త దానముచేసి బ్రాహ్మణాశీర్వాదము గ్రహించవలయును. ఇది యముని మతమని నారదమునివరుఁడువచించె. కొందఱు ఇతరజంతువును ఇతనిమీఁదదిగితుడిచి అగ్రామమంతయు ద్రిప్పిపారవేయుదురు-

ఇతి శ్మశానానీత శవజీవన విచార స్సమాప్తః.

## * ప్రేతశిలానష్టమ్. *

దశాహముతోగా జరుపు నిత్యకర్మ ప్రారంభించిన పిమ్మట దశాహేములోపల ప్రమాదంబువలన శిలనష్టమైనయెడల అన్య శిల నుంచి పూర్వమువలె ఆవాహనముజేసి మఱల తొలుతయిచ్చిన మృత్తికాస్నాన వాసోదక తిలోదకాదులు పిండప్రదానంబులు మొదటి రోజునుంచి యథాక్రమముగా జరుపవలెను నష్టమైనశిల మరల లభించినయెడల విధ్యుక్తముగ వాసోదకాదుల నీయనక్కరలేదు. స్థల భ్రంశమునందును, శిలాపాత్ర కర్తృద్రవ్యంబులు నశించినను ప్రాజాపత్యత్రియంబునుజేసి పిండోదక దానంబులను మఱల యథా విధిగా చేయవలయునని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియె. తక్కిన విషయములు ధర్మశాస్త్రములందు జూడవలయును.

ఇతి శిలానష్ట విషయ స్సమాప్తః.

## * సంవత్సర విమోకే తిథిద్వయ శ్రాద్ధ నిర్ణయః *

గౌతమః॥ శ్లో॥ తిథిద్వయేపి సంప్రాప్తె విమోకం ప్రథమాబ్దికమ్ । తస్మిన్నేవ క్రమాత్కుర్యాత్పూర్వాహ్ణే చాపరాహ్ణకే ॥

తా॥ సంవత్సర విమోకదినమందు తిథిద్వయము తటస్థించెనేని సంవత్సరవిమోక ప్రథమాబ్దికములు రెండును ఆదినమందే నాచరింపవలెను. ఎట్లనిన పూర్వాహ్ణమందు సంవత్సరవిమోక శ్రాద్ధంబును అపరాహ్ణమందు ఆబ్దికశ్రాద్ధంబు నాచరించవలయునని శ్రీ గౌతముల వారి యభిప్రాయము.

కించ॥ పరాశరాది ఋషిభిః రత్నావళ్యాం విష్ణుస్మృతౌ ॥

శ్లో॥ విమోకాదిద్వయంకుర్యాద్ద్విజశ్రేష్ఠ స్తిథిద్వయే। విమోకం పూర్వతఃకృత్వా ఆబ్దికం తదనంతరం । తిథిద్వయే తథాకార్యం అన్యథా దోషభాగ్భవేత్ ॥

తా॥ తిథిద్వయ దినమునందు విమోకము ప్రథమాబ్దికము వచ్చినయెడల పూర్వాహ్ణమునందు విమోకముజరిపి అపరాహ్ణమందు ప్రథమాబ్దికము చేయవలెను. అలా చేయనియెడల దోషము చేసిన వాడగును.

కించ॥ శ్లో॥ సంవత్సరవిమోకాఖ్యం శ్రాద్ధంకుర్యాద్విచక్షణః। తథాబ్దికం వినాపూర్వం ఊనాబ్దికమథాపివా। ఊన త్రైపక్షికంచైవ నకుర్యా న్మాసికంవినా। ఊనాంత్య మాసికం త్యక్త్వా విమోకం నైవ కారయేత్ ॥

తా॥ కర్మనిష్ఠగలవాఁడు సంవత్సరవిమోకమును జేయ వలసినది. ఊనాబ్దికమును జేయకుండ ప్రత్యాబ్దికమును జేయఁగూడదు. త్రైపక్షికమును విడిచి మాసికమును పెట్టకూడదు. ఊన మైన తరువాత మాసికమును విడిచి సంవత్సరవిమోకమును జేయఁకూడదు.

ఇతి సంవత్సరవిమోకే తిథిద్వయ శ్రాద్ధనిర్ణయ స్సమాప్తః.

* మృతతిథినిర్ణయః. *

సిద్ధాంతసార సంగ్రహే॥ శ్లో॥ సాయంతన్యపరత్రచే న్మృతతిథి స్సైవాబ్దికే మాసికే। సాగ్రాహ్యాద్వ్యపరాహ్ణయో ర్యదితదా యత్రాధికా సామతా। తుల్యాచేదుభయ పరాహ్ణసమయే పూర్వానచేత్తద్వయోః। పూర్వైవత్రి ముహూర్త గాస్త సమయే నో చేత్పరైవోచితా ॥

తా॥ అహః ప్రమాణ ఘటికలను అయిదుపాళ్ళు చేయునది. వానిలో మొదటిభాగము ప్రాతఃకాలము. ౨ వ భాగము సంగమకాలము. 3 వది మధ్యాహ్నము. ౪ వది అపరాహ్ణము. ౫ వది సాయాహ్నము. ఈ అయిదుకాలములలో ౪ వ అపరాహ్ణ కాలమున నేతిథి ఘటికలు వ్యాపించియుండునో ఆ తిథి శ్రాద్ధాది పైతృకము మొదలగు సత్కర్మలకు ముఖ్యము. ఒకతిథికి రెండుదినములలో వ్యాప్తిగలిగియుంటే యేదినమున అధికముగానుండునో దాని నాచరింపవలయును. రెండుదినములలో అపరాహ్ణవ్యాప్తి సమముగానుండిన పూర్వమనఁగా మొదటి దినమే ముఖ్యము, రెండు అపరాహ్ణములలోను వ్యాపింపకపోయిని పూర్వదినమున సాయాహ్నవ్యాప్తి చక్కగానుండిన నాఁడేముఖ్యము. రెండు అపరాహ్ణములలోను సమముగా నుండినప్పుడు తిథి వృద్ధిపక్షమున రెండవనాఁడును, క్షయపక్షమున మొదటినాఁడును కర్తవ్యము. దీనినెఱిఁగి శిష్టులందఱును ఆచరింకపుచున్నారు, ఇఁక సంకల్ప స్నాన దాన వ్రత దేవపూజాదుల

లో విశేష విధులు గలుగునవి తప్ప తక్కినవన్నియు సత్కర్మలకును సూర్యోదయకాలమున నేతిథి గలిగియుండునో ఆతిథియే సంకల్పము నకు ముఖ్యము.

కించ॥ శ్లో॥ యాంతిథిం సమనుప్రాప్య ఉదయం యాతి భాస్కరః । సాతిథి స్సకలాజ్ఞేయా స్నానదాన వ్రతాదిషు ॥

తా॥ సూర్యుఁడు యేతిథియందుదయించునో ఆ తిథి స్నాన దాన వ్రతములు మొదలుగాఁగల సకలకార్యములకు ప్రాముఖ్యము. ఆతిథియందే సంకల్పము. ఇతి మృతతిథినిర్ణయ స్సమాప్తః.

* శ్రాద్ధ స మ యే త్యా జ్య వి ష యః *

జ్యోతిస్సంగ్రహే । శ్లో॥ స్నానే దానే జపే హోమే వైశ్వదేవే సురార్చనే । ప్రాయశ్చిత్తే తథాశ్రాద్ధే ప్రశస్తావిషనాడికాః ॥

తా॥ స్నానకాలమునందు. దానకాలమందు, జపకాలమందు, హోమకాలమందు, వైశ్వదేవకాలమందు, దేవతార్చనకాలమందు, ప్రాయశ్చిత్తాదులయందు, శ్రాద్ధకాలమందు, త్యాజ్యము వచ్చినప్పటికిని పై కార్యములు చేయవచ్చును

కించ॥ ప్రాచీనగ్రంథే॥ శ్లో॥ ఆసనే శయనే భోజ్యే మలమూత్రోత్సృజేతథా । ఉగ్రకర్మణ్యస్త్రవధా ప్రశస్తా విషనాడికాః ॥

తా॥ కూర్చుండుటయందు, నిద్రించుట, భోజనకాలము, మలమూత్రములు విడుచుట, చెడుపనివిషయమై, అస్త్ర ప్రయోగాదులయందును విషఘడియలు నింద్యములుగావు.

ఇతి శ్రాద్ధసమయే త్యాజ్యవిషయ స్సమాప్తః

* దా నా ది ఫ ల ని రూ ప ణ మ్ *

అయ్యా, ౮౪ లక్షల జీవరాసులలో నీమనుష్యజన్మము లభించుట బహుదుర్లభము. ఇట్టిజన్మము లభించియు దాన ధర్మాదులు చేయకయుండు మనుష్యుఁడు మఱుజన్మమునందు దరిద్రుఁడై పుట్టునని స్మృతులు ఘోషించుచుండెను. లోకమందు మనము జూచుచుంటిమి. మనుష్య జన్మమునందు దరిద్రుఁడై పుట్టి పాపకార్యములఁ జేయుచు అందువలన నరకముఁజెంది సమస్తబాధల కోర్వలేక దుఃఖించుచు మఱల దరిద్రుఁడుగా పుట్టును. తత్ప్రమాణము-

శ్లో॥ అదానదోషేణ భవేద్దరిద్రో దారిద్ర్య దోషేణ కరోతి పాపం । పాపాదవశ్యం నరకం ప్రయాతి పునర్దరిద్రః పునరేవ పాపీ ॥ అన్నట్లు దానముచేయని దోషమువల్లనే వాఁడు దరిద్రుఁడుగా బుట్టుచు మఱల గిట్టుచు యీప్రకారము సంసార సాగరమునందగిలి అల్లాడుచుండును గాని ఒకప్పుడయినను ముక్తిపొందజాలఁడు.

శ్లో॥ దరిద్రాయ కృతందానం శూన్య లింగస్య పూజనం । అనాథ ప్రేత సంస్కార మశ్వమేధసమం విదుః ॥

తా॥ దరిద్రునికొఱకు చేయఁబడిన దానమును, పూజలేనిగుళ్ళకు పూజగలుగఁజేయుటయు, దిక్కులేని పీనుగనెత్తికాల్చుటయు ఈ మూఁడును అశ్వమేధయాగము చేయుటవలన గలుగు ఫలమునకు సమానమగు ఫలమునిచ్చునని బహుగ్రంథములు చెప్పుచున్నవి.

శ్లో॥ అనిత్యాని శరీరాణి విభవోనైవ శాశ్వతః। నిత్యం సన్నిహితో మృత్యుః। కర్తవ్యో ధర్మసంగ్రహః॥

తా॥ ఈ శరీరము నిత్యముకానిది. సంపదలు నిలుకడలేనివి. మృత్యుదేవత దగ్గరనే కాచియున్నది. కాఁబట్టి మనము పితృమాతృ కర్మలందయినా తనశక్తికొలఁది దానధర్మములు చేయుటచే ఈ జన్మము వచ్చినందున తన పితరులు సంతోషిండమేగాక తనకు రాఁబోవు జన్మమందు మహా భాగ్యవంతుఁడై జ్ఞానముగలవాఁడై ధనముగల గృహాదులందు జన్మించును. ఇదియునుఁగాక-

శ్లో॥ చలాలక్ష్మీశ్చలాః ప్రాణాశ్చలో దేహోపి యౌవనం । చలం చలశ్చ సంసారః కీర్తిర్ధర్మశ్చ నిశ్చలా ॥

తా॥ సంపదలు, ప్రాణము, దేహము, యౌవనము, సంసారము యివియన్నియును నీటిబుగ్గలరీతిగా అస్థిరములైనవి. అయితే సత్యముగా కీర్తియు ధర్మమును యీరెండుమాత్రమే స్థిరముగానుండును.

శ్లో॥ అర్థాః పారదచంచలాః గిరినదీ వేగోపమంజీవితం। ధర్మం యోనకరోతి నిశ్చలమతిః స్వర్గార్గళోద్ఘాటనం । పశ్చాత్తాప యుతో జరాపరిణత శోకాగ్నినా దహ్యతే । తస్మాన్మాతృ పితృ క్రియాది సమయే దానం ప్రశస్తం స్మృతమ్ ॥

తా॥ సంపదలు పాదరసమువలె నిలకడగానివి, కొండమీఁద నుండి క్రిందికి ప్రవహించునదులు యెంత శీఘ్రముగా ప్రవహించునో అంత శీఘ్రముగా జీవితము పారిపోవును. సముద్రమునందలి అలల యందు బుట్టిన నీటితుంపరలు యెట్లునిలకడలేకపోవునో అట్లు మానవ జన్మము నిలకడలేనిదాను. సముద్రమునందలి నురుగురీతిగా మన జీవితకాలము అస్థిరమైనది కాఁబట్టి స్వర్గద్వారమునకు అడ్డముగా మూసియుండెడు తలుపును దెఱచి మనలను స్వర్గమునజేర్చి సకల సౌఖ్యములను బొందునట్లుజేసెడు ధర్మము నెవ్వఁడు చేయఁడో వాఁడు మరణకాలమున శోకాగ్నిచేత తపించును. కాఁబట్టి తల్లి దండ్రుల శ్రాద్ధాది దినములయందయినను దానముజేయుట ప్రశస్తము.

శ్లో॥ ధర్మః శర్మ భుజంగపు గవపురీ సారం విధాతుంక్షమో। ధర్మః ప్రాపిత మర్త్యలోక విపుల ప్రీతి స్తథాశంసినా। ధర్మస్స్వర్న గరీ నిరంతరసుధా స్వాదోదయస్యాస్పదం । ధర్మః కిం నకరోతి ముక్తి వనితా సంభోగ భాగ్యాంతరమ్ ॥

తా॥ ధర్మము నాగేంద్ర పట్టణమునందలి స్థిరమైన సుఖము ననుభవించునట్లు చేయును. భూలోకమున ధర్మముఁ జేయువానికే మంచి కీర్తియు, జనులవలన ప్రీతియు కలుగును. మఱియు ధర్మము స్వర్గలోకమునందలి దేవామృతము పానముచేసి చావు పుట్టుకలు లేక సదా దేవేంద్రభోగముల ననుభవించునట్లుచేయును. ధర్మమువలన సకలసుఖములుకల్గును. ధర్మము ముక్తికాంతతోభోగించునట్లు జేయును.

శ్లో॥ ఏవం త్యాగదుణశ్లాఘ్యః సర్వేషు గుణరాసిషు । త్యాగా జ్జగతి పూజ్యంతే పశు పాషాణ పాదపాః ॥

తా॥ దానము చేయునట్టి గుణమే సకల గుణములలోపల సద్గుణము. దానముచేయువాఁడే గుణవంతుఁడు- పశువులలో కామధేనువును, వృక్షములలో కల్పవృక్షమును, శిలలలో చింతామణియును శిలయును యెవరెవరు యేదియడిగినను తడవులేక నిచ్చునట్టి గుణమును కలిగియుండుటవల్లనేగదా అవి దేవతలు, మనుష్యులు మొదలయిన వారిచేత సదా పూజింపఁబడుచున్నవి. ఇంతియేగాదు-

దానమాహాత్మ్యమందు- శ్లో॥ సాలగ్రామ శిలాం పృథ్వీం కన్యాం విద్యాంచ వైదికీం । యోదత్తేయశ్చగృహ్ణాతి తావుభౌస్వర్గ గామినౌ ॥ అని చెప్పఁబడినది.

ఆదిత్యపురాణమందు- శ్లో॥ జ్ఞానదాదధికం కించిద్దృశ్యతే భువనత్రయే । దానేన ప్రాప్యతే స్వర్గః ॥ అని చెప్పఁబడినది. యస్య విత్తం నధర్మాయ నోపభోగాయ తస్యవిత్తం నిరర్థకమ్ ॥

గరుడపురాణమందు- శ్లో॥ పితు శ్శతగుణం దానం సహస్రం మాతురుచ్యతే । భగిన్యాం దశసహస్రం సోదరే దత్తమక్షయమ్ ॥

తా॥ దానాదులవలన స్వర్గ పశు పుత్ర విత్తాదులును, కీర్తియును గలుగుచున్నవి. అందువలన దానమునకన్న నధికమైన దెక్కడను మూఁడులోకములయం దేదియును లేదు. ఎవ్వనియొక్క ద్రవ్యము ధర్మము కొఱకైనను, తాననుభవించుట కొఱకైనను ఉపయోగించునో అతని ద్రవ్యము సార్థకము లేకున్నచో నిరర్థకము.

కించ॥ మనుస్మృతౌ॥ శ్లో॥ వారిద స్తృప్తిమాప్నోతి సుఖ మక్షయమన్నదః । తిలప్రదః ప్రజామిష్టం దీపదశ్చక్షు రుత్తమమ్ ॥

తా॥ జలమునిచ్చినవాఁడు క్షుత్పిపాసలులేని తృప్తినిబొందును అన్నదాత యక్షయసుఖమునొందును. తిలలనిచ్చువాఁడు తనకిష్టమగు సంతానముగలవాఁడగును. దేవ బ్రాహ్మణాదుల కుపయోగముగ దీపంబిడినవాఁ డుత్తమములగు చక్షుస్సుల నొందును.

శ్లో॥ భూమిదో భూమిమాప్నోతి దీర్ఘమాయుర్హిరణ్యదః । గృహదో గ్ర్యాణివేశ్మాని రూప్యదో రూపముత్తమమ్ ॥

తా॥ భూదాత భూపతియగును- సువర్ణము దానమిచ్చువాఁడు దీర్ఘాయుష్యము నొందును- గృహప్రదుఁడు మంచి గృహములుగలవాఁడగును. వెండి నిచ్చినయతఁ డందఱికంటె నెక్కుడు సౌందర్యము గలవాఁడగును.

శ్లో॥ వాసోద శ్చంద్రసాలోక్య మశ్విసాలోక్య మశ్వదః। అనడుత్ప్రద శ్శ్రియం పుష్టాం గోదో బ్రధ్నస్య విష్టపమ్ ॥

తా॥ వస్త్రదాత చంద్రలోకమును, గుఱ్ఱమునిచ్చినవాఁడశ్వి నీదేవతల లోకమును, యెద్దునిచ్చేనేని సంపూర్ణనుగుసంపత్తిని, గోవు నిచ్చినయతఁడు సూర్యలోకమును నొందును.

శ్లో॥ యాన శయ్యాప్రదో భార్యా మైశ్వర్య మభయప్రదః। ధాన్యద శ్శాశ్వతంసౌఖ్యం బ్రహ్మదో బ్రహ్మసాష్టితామ్ ॥

తా॥ రథాదియానములు శయ్యలు నొసఁగినవానికి భార్యా లాభమగును. ప్రాణుల కభయమిచ్చునతఁడు- ప్రాణహింస చేయని వాఁడు గొప్ప యైశ్వర్యమును బొందును. ధాన్యముననఃగా శాలి యవ గోధూమాదుల నిచ్చువాఁడు శాశ్వత సుఖమునొందును. వేద మును జెప్పినను- తదర్థమును దెలిపినను బ్రహ్మ లోకమునందు ముక్తుఁడగును.

శ్లో॥ సర్వేషామేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే। వా ర్యన్న గోమహీవాస స్తిలకాంచన సర్పిషామ్ ॥

తా॥ అన్నోదక గోమహీ తిల కాంచనాది దానము. లేవి గలవో వాని యన్నింటిలోను వేద వేదాంగములను బ్రాహ్మణునికిఁ జెప్పుట యుత్కృష్ట ఫలప్రదంబగును.

శ్లో॥ యేనయేనతు భావేన యద్యద్దానం ప్రయచ్ఛతి। తత్త త్తేనైవ భావేన ప్రాప్నోతి ప్రతి పూజితః ॥

తా॥ ఎవరు యేయే అభిప్రాయముచే స్వర్గా ద్యపేక్షచేగాని, ముముక్షువైతే నిష్కామనచేగాని యేదియేది దానముచేయునో ఆ యా భావముచే నాయా దానముల ఫలముగా జన్మాంతరమందు పూజితుఁడై దానిదాని ఫలమును బొందుదురు.

శ్లో॥ ధర్మం శనైస్సంచినుయా ద్వల్మీకమివ పుత్రికాః। పర లోక సహాయార్థం సర్వభూతాన్యపీడయన్ ॥

తా॥ భూతపీడ లేనుండ పరలోక సహాయార్థమై ధర్మమును చెదలపురుగులు పుట్టఁబెట్టినట్లు మెల్లమెల్లగా వృద్ధినొందించవలెను.

శ్లో॥ నాముత్రహి సహాయార్థం పితా మాతావతిష్ఠతః। నపు త్ర దారా నజ్ఞాతి ర్ధర్మ స్తిష్ఠతి కేవలః ॥

తా॥ పరలోకమునందు సహాయులు తల్లి- తండ్రి- భార్య- పుత్రుఁడు- జ్ఞాతి- వీరెవ్వరును గారు. ధర్మమొక్కటియే పరలోక సహాయమై యుండును. సకల చుట్టములు తనతోఁగూడ వచ్చు వారుగారు. వాఁడుచేసిన పాపముగాని పుణ్యముగాని వానివాని వెంటనంటిపోవును ఒక మనుష్యుఁడు యెంత ధనవంతుఁడైనను దానమూలముగా నిచ్చినది తప్ప తక్కిన ద్రవ్యమంతయు॰తనకు చెందునదిగాదు, పూర్వజన్మమందు విశేషముగ ద్రవ్యమార్జించి దానిని సత్కర్మలయందును, దానాది క్రియలయందును ఉపయోగించిన వాఁడే యీజన్మమున మహాభాగ్యవంతుఁడగును, అట్టివాఁడీ జన్మమున విశేష భక్తిశ్రద్ధలతోఁడ సత్కర్మములఁజేసెనేని యింకొకజన్మమున మిగుల భాగ్యవంతుఁడై ధర్మార్థ కామమోక్షముల కర్హుఁడగును. భక్తిశ్రద్ధలులేక ధర్మముఁజేసినను ఆధనము॰వ్యర్థము- భక్తిశ్రద్ధలతో నొనర్చిన ధర్మము కొంచెమైనను కొండంతయగును. ఎట్టి కార్యమునకుగాని మనస్సు నిర్మలముగా నుండవలయును. మనో నిశ్చయములేక చేసిన తపముగాని, దానముగాని, ధర్మముగాని నిరర్థకంబగును. ప్రతిమానవుఁడును తనకు రోగమువచ్చుననియు, వృద్ధత్వము వచ్చుననియు, బలముతగ్గుననియు చక్కఁగాదెలిసికొని అంత్యకాలమందు సద్గతిఁబొందుట బాల్యములో వివేకము దెలిసినదిమొదలు సత్కార్యములుచేయుచు రావలెను. సత్కర్మములను రేపుచేయుదము, తర్వాతచేయుదమను తలంపుకూడదు. ఏలననఁగా, దేహము నిత్యము కనుక సాధ్యమైనమట్టుకు తలఁచిన పని తలఁచినట్లు చేయవలయును. ప్రపంచమందు పుణ్యాత్ములుచేసిన స్థిరమగు యేర్పాట్లు యెన్ని జీవరాసులు బ్రతుకుచున్నవో చూడుడు. మనము యెన్నాళ్ళు బ్రతికినను మరణము స్థిరమని తలఁచువారు బహు అరుదుగానుండెదరు. లోకమందు ఒకవంశములో నొక పుణ్యాత్ముఁడు సత్రము, వనము, తటాకము, ధతనిక్షేపము శివాలయము, కూపము, గ్రంథము మొదలగు నిట్టి మహోపకారములలో నొకదానిని ప్రతిష్ఠించి నందున అశేషజనులు అట్టివారిని నిత్యము స్మరింపుదురు. అట్టివారు మృతిఁబొందినను బ్రతికియున్నవారితో సమానులే. వారికి స్వర్గమే

నిశ్చయము. మన జీవితకాలము విచారింపఁగా రేపో మాపో అన్న ట్లుండెను. ఇంతలో ద్రోవదోచుట, తప్పుసృష్టులు జేయుట, హత్యఁ జేయుట మొదలగు తప్పుకార్యములఁజేసి సంపాదించి దారాపుత్రులు మొదలగు బంధువులకుఁ బెట్టును. అందువలన యీ జీవునకు ఫలము కలదా ? లేదు. ఎవ్వఁడైతే పాపకార్యములను జేయునో వాఁడు మాత్రమే దానిఫలము ననుభవింపవలెను. అనఁగా నరకకూపమందు బడి చాలాకాలము నాబాధకోర్వలేక యేడ్చుచుండును. తిరిగి అట్టి మహాపాపనివృత్తికొఱకు మఱుజన్మంబున తానుచేసిన పాపమునకే అట్టి దుష్కృతశేషము ననుభవించుటకు నీచజన్మమందు మహారోగ వంతుఁడై పుట్టుచు గిట్టుచు నుండును కాని ఒకప్పుడయినను భగ వద్భక్తియు, దేవబ్రాహ్మణ గురుపూజయు, విద్యాదానాది మహాదా సములు మొదలగు మహోపకారములను తాను జేయుటకు శక్తిలేక పోయినను చేయువారికయినా తాను సహాయభూతుడై అధర్మములను వృద్ధిజేసినట్లాయెనా యితనికికూడ ఫలముగలదు. కాని దానప్రదా తకు మాత్రము ఇహలోక పరలోకములయందు బహుకీర్తియు, ప్రతి ష్ఠయు అందువలన స్వర్గము నిశ్చయముగా కలుగునని గ్రంథములు ఘోషింపుచున్నవి. కనుక అటువంటివానిజన్మము సార్థకము. లేకు న్నచో నిరర్థకము పట్టిమాటలతో నేమిప్రయోజనము- తన శక్తికొ లఁది తాను జీవించియుండఁగానే గోదానాది మహాదానములు తత్క్ష ణమే జఱుపవలయును. దేహమనిత్యముగనుక పుణ్యకార్యముల విషయమై తలఁచినపని తలఁచినట్లు చేయుట ప్రథమకర్తవ్యము.

## * కారుణ్యవిషయః *

శ్లో॥ ఆదౌ పితా తథా మాతా సాపత్నీ జననీతథా। మాతా మహ స్సపత్నీకా ఆత్మపత్నీ త్వనంతరమ్ ॥ సుత భ్రాతృ పితృవ్యా శ్చ మాతులాస్సహ భార్యకా। దుహితా భగినీచైవ దౌహిత్రో భాగి నేయకః ॥ పితృష్వసా మాతృష్వసా జామాతా భావుక స్నుషా। శ్వశురశ్యాలకశ్చైవ స్వామినో గురురర్థినః ॥ కించ ॥ ( జనక పితృ మాతౄణాం తర్పణం విశేషః )

తా॥ ముందు తల్లి దండ్రులు, పిదప సవతితల్లి, అటు పిమ్మట మాతామహా మాతుః పితామహా మాతుః ప్రపితామహులు, మాతామహీ మాతుః పితామహీ మాతుః ప్రపితామహీలు, తనభార్య, కుమారుఁడు, అన్నదమ్ములు, పినతండ్రి, పెదతండ్రి, మేనమామ, మేనమామభార్య, కుమార్తె, తోడబుట్టువు. మనుమఁడు, మేనల్లుఁడు మేనత్తలు, పినతల్లి, పెదతల్లులు, అల్లుఁడు, లోబుట్టువుల భర్త, కోడలు, భార్యయొక్క తండ్రి, భార్యయొక్క సోదరుఁడు, గురువు, యాచకులు వీరలు క్రమముగ కారుణ్యములోనివారని తెలియవలెను.

అక్క (జ్యేష్ఠభగిని)
అత్త (శ్వశ్రువు)
అన్న (జ్యేష్ఠభ్రాత)
అన్నకూతురు (జ్యేష్ఠభ్రాతృపుత్రి)
అన్నకొడుకు (జ్యేష్ఠభ్రాతృపుత్రః
అప్పకూతురు (జ్యేష్ఠభగినీపుత్రి)
అప్పకొడుకు (జ్యేష్ఠభగినీపుత్రుఁడు
అప్పమగడు (భావుకుడు)
అమ్మమ్మ (మాతామహీ)
అల్లుడు (జామాత)
తమ్మునికొడుకు (కనిష్ఠభ్రాతృ పు॥)
తల్లిచెల్లెలు (కనిష్ఠమాతృభగిని)
తల్లి అప్పకూతురు (జ్యేష్ఠమాతృ భగినీ పుత్రిక)
కూతురు (దుహిత)
కొడుకు కూతురు (పౌత్రి)
చెల్లెలు (కనిష్ఠభగిని)
చెల్లెలుకూతురు (కనిష్ఠభగినీపుత్రి
చెల్లెలికొడుకు (క॥ భ॥ పుత్రుఁడు)
చెల్లెలిమగడు (భావుకుఁడు)
తండ్రి (పిత)
తండ్రి తండ్రి (పితామహుఁడు)
తమ్ముడు (కనిష్ఠభ్రాత)
తమ్మునికూతురు (క॥ భ్రాతృపుత్రి)
పినతల్లికొడుకు (క॥ మా॥ భ॥ పు॥
పెదతండ్రి (జ్యేష్ఠపితృవ్యుడు)
పెదతండ్రి కూతురు (జ్యేష్ఠ పితృవ్య పుత్రి)
తల్లి అప్పకొడుకు (జ్యేష్ఠ మాతృ భగినీ పుత్రుఁడు)
నాయనమ్మ (పితామహీ)
పినతండ్రి (కనిష్ఠపితృవ్యుడు)
పినతండ్రి కూతురు (క॥ పి॥ పుత్రి)
పినతండ్రి కొడుకు (క॥ పి॥ పు॥)
పినతండ్రిభార్య (క॥ పి॥ పత్ని)
పినతల్లికూతురు (క॥మా॥భ॥పుత్రి
పెదతండ్రికొడుకు (జ్యేష్ఠ పితృవ్య పుత్రుడు)
పెదతండ్రిభార్య (జ్యే॥ పి॥పత్ని
భార్యసోదరుడు (స్యాలకుడు)
మగని తమ్ముని కూతురు (భర్తృ కనిష్ఠ భ్రాతృ పుత్రి)

| | |
|---|---|
| మనుమరాలు (దౌహిత్రి) | మేనత్తకూతురు (పితృభగినీపుత్రి) |
| మేనత్త (పితృభగిని) | మేనత్తకొడుకు (పితృభ॥పుత్రుడు |

కాత్యాయనః॥ శ్లో॥ సంకల్పాసనయోష్షష్టి ద్వితీయావాహనే తథా । అన్నదానే చతుర్థీస్యా చ్ఛేషాస్సంబుద్ధయస్స్మృతాః ॥

పారస్కరః॥ శ్లో॥ అర్ఘ్యదానేచ సంకల్పే పిండదానే తథాక్షయే । గోత్ర సంబంధనామాని తథా శత్ప్రతిపాదయేత్॥

ఇతి కారుణ్య విధిస్సమాప్తః.

* కారుణ్య శబ్దములు. *

ఋకారాంతః- పుంలింగః-పితృశబ్దః-(తండ్రి)

| విభక్తిః. | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | పితా | పితరౌ | పితరః |
| సం | హేపితః | హేపితరౌ | హేపితరః |
| ద్వి | పితరః | పితరౌ | పితౄన్ |
| తృ | పిత్రా | పితృభ్యాం | పితృభిః |
| చ | పిత్రే | పితృభ్యాం | పితృభ్యః |
| పం | పితుః | పితృభ్యాం | పితృభ్యః |
| ష | పితుః | పిత్రోః | పితౄణాం |
| స | పితరి | పిత్రోః | పితృషు |

ఏవం భ్రాతా- జామాతా- ఇత్యాదయః.

ఋకారాంత - స్త్రీలింగో - మాతృశబ్దః - (తల్లి)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | మాతా | మాతరౌ | మాతరః |
| సం | హేమాతః | హేమాతరౌ | హేమాతరః |
| ద్వి | మాతరం | మాతరౌ | మాతౄః |
| తృ | మాత్రా | మాతృభ్యాం | మాతృభిః |
| చ | మాత్రే | మాతృభ్యాం | మాతృభ్యః |
| పం | మాతుః | మాతృభ్యాం | మాతృభ్యః |
| ష | మాతుః | మాత్రోః | మాతౄణాం |
| స | మాతరి | మాత్రోః | మాతృషు |

ఏవం దుహితా- ఇత్యాదయః.

ఈకారాంత స్త్రీలింగో జననీ శబ్దః (జనకతల్లి)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | జననీ | జనన్యౌ | జనన్యః |
| సం | హేజనని | హేజనన్యౌ | హేజనన్యః |
| ద్వి | జననీం | జనన్యౌ | జననీః |
| తృ | జనన్యా | జననీభ్యాం | జననీభిః |
| చ | జనన్యై | జననీభ్యాం | జననీభ్యః |
| పం | జనన్యాః | జననీభ్యాం | జననీభ్యః |
| ష | జనన్యాః | జనన్యోః | జననీనాం |
| స | జనన్యాం | జనన్యోః | జననీషు |

ఏవం భగినీ- పితృభగినీ- మాతృభగినీ- దేవీ- దాసీ- ఇత్యాదయః.

ఆకారాంతః పుంలింగో మాతామహ శబ్దః (తల్లితండ్రి)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | మాతామహః | మాతామహౌ | మాతామహాః |
| సం | హేమాతామహ | హేమాతామహౌ | హేమాతామహాః |
| ద్వి | మాతామహం | మాతామహౌ | మాతామహాన్ |
| తృ | మాతామహేన | మాతామహాభ్యాం | మాతామహైః |
| చ | మాతామహాయ | మాతామహాభ్యాం | మాతామహేభ్యః |
| పం | మాతామహాత్ | మాతామహాభ్యాం | మాతామహేభ్యః |
| ష | మాతామహస్య | మాతామహయోః | మాతామహానాం |
| స | మాతామహే | మాతామహయోః | మాతామహేషు |

ఏవం దౌహిత్రః- భాగినేయః- భ్రాతృకః- ఇత్యాదయః

ఈకారాంత స్త్రీలింగో మాతామహీ శబ్దః (తల్లి తల్లి)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | మాతామహీ | మాతామహ్యౌ | మాతామహ్యః |
| ం | హేమాతామహి | హేమాతామహ్యౌ | హేమాతామహ్యః |

| | | | |
|---|---|---|---|
| ద్వి | మాతామహీం | మాతామహ్యౌ | మాతామహీః |
| తృ | మాతామహ్యా | మాతామహీభ్యాం | మాతామహీభిః |
| చ | మాతామహ్యై | మాతామహీభ్యాం | మాతామహీభ్యః |
| పం | మాతామహ్యాః | మాతామహీభ్యాం | మాతామహీభ్యః |
| ష | మాతామహ్యాః | మాతామహ్యోః | మాతామహీనాం |
| స | మాతామహ్యాం | మాతామహ్యోః | మాతామహీషు |

ఈకారాంతః స్త్రీలింగో పత్నీశబ్దః- (భార్య)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | పత్నీ | పత్న్యౌ | పత్న్యః |
| సం | హేపత్ని | హేపత్న్యౌ | హేపత్న్యః |
| ద్వి | పత్నీం | పత్న్యౌ | పత్నీః |
| తృ | పత్న్యా | పత్నీభ్యాం | పత్నీభిః |
| చ | పత్న్యై | పత్నీభ్యాం | పత్నీభ్యః |
| పం | పత్న్యాః | పత్నీభ్యాం | పత్నీభ్యః |
| ష | పత్న్యా | పత్న్యోః | పత్నీనాం |
| స | పత్న్యాం | పత్న్యోః | పత్నీషు |

ఏవం దేవీ- దాసీ- ఇత్యాదయః

అకారాంతః పుంలింగో సుతశబ్దః- (పుత్రుడు)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | సుతః | సుతౌ | సుతాః |
| సం | హేసుత | హేసుతౌ | హేసుతాః |
| ద్వి | సుతం | సుతౌ | సుతాన్ |
| తృ | సుతేన | సుతాభ్యాం | సుతైః |
| చ | సుతాయ | సుతాభ్యాం | సుతేభ్యః |
| పం | సుతాత్ | సుతాభ్యాం | సుతేభ్యః |
| ష | సుతస్య | సుతయోః | సుతానాం |
| స | సుతే | సుతయోః | సుతేషు |

ఏవం మాతులః- భావుకః- శ్వశురః- స్యాలకః- గుప్త-
దాసః- ప్రేతః- ఇత్యాదయః.

అకారాంత స్త్రీలింగో స్నుషా శబ్దః (కోడలు)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | స్నుషా | స్నుషే | స్నుషాః |
| సం | హేస్నుషే | హేస్నుషే | హేస్నుషాః |
| ద్వి | స్నుషాం | స్నుషే | స్నుషాః |
| తృ | స్నుషయా | స్నుషాభ్యాం | స్నుషాభిః |
| చ | స్నుషాయై | స్నుషాభ్యాం | స్నుషాభ్యః |
| పం | స్నుషాయాః | స్నుషాభ్యాం | స్నుషాభ్యః |
| ష | స్నుషాయాః | స్నుషయోః | స్నుషాణాం |
| స | స్నుషాయాం | స్నుషయోః | స్నుషాసు |

ఏవం గుప్తా - ప్రేతా - ఇత్యాదయః,

ఊకారాంత స్త్రీలింగో శ్వశ్రూః శబ్దః (అత్త)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | శ్వశ్రూః | శ్వశ్ర్వౌ | శ్వశ్ర్వః |
| సం | హేశ్వశ్రు | హేశ్వశ్ర్వౌ | హేశ్వశ్ర్వః |
| ద్వి | శ్వశ్రూం | శ్వశ్ర్వౌ | శ్వశ్రూః |
| తృ | శ్వశ్ర్వా | శ్వశ్రూభ్యాం | శ్వశ్రూభిః |
| చ | శ్వశ్ర్వై | శ్వశ్రూభ్యాం | శ్వశ్రూభ్యః |
| పం | శ్వశ్ర్వాః | శ్వశ్రూభ్యాం | శ్వశ్రూభ్యః |
| ష | శ్వశ్ర్వాః | శ్వశ్ర్వోః | శ్వశ్రూణాం |
| స | శ్వశ్ర్వాం | శ్వశ్ర్వోః | శ్వశ్రూషు |

ఉకారాంతః పుంలింగో గురు శబ్దః (గురువు)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | గురుః | గురూ | గురవః |
| సం | హేగురో | హేగురూ | హేగురవః |

| | | | |
|---|---|---|---|
| ద్వి | గురుం | గురూ | గురూన్ |
| తృ | గురుణా | గురుభ్యాం | గురుభిః |
| చ | గురవే | గురుభ్యాం | గురుభ్యః |
| పం | గురోః | గురుభ్యాం | గురుభ్యః |
| ష | గురోః | గుర్వోః | గురూణాం |
| స | గురౌ | గుర్వోః | గురుషు |

వకారాంతః పుంలింగో స్వామి శబ్దః (స్వామి)

| | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | స్వామీ | స్వామినౌ | స్వామినః |
| సం | హేస్వామిన్ | హేస్వామినౌ | హేస్వామినః |
| ద్వి | స్వామినం | స్వామినౌ | స్వామినః |
| తృ | స్వామినా | స్వామిభ్యాం | స్వామిభిః |
| చ | స్వామినే | స్వామిభ్యాం | స్వామిభ్యః |
| పం | స్వామినః | స్వామిభ్యాం | స్వామిభ్యః |
| ష | స్వామినః | స్వామినోః | స్వామినాం |
| స | స్వామిని | స్వామినోః | స్వామిషు |

ఏవం శర్మా - వర్మా - ఇత్యాదయః.

గ్రంథవిస్తరభయంబున కొన్ని శబ్దము లీగ్రంథమం చేర్చనైతిని.

* శ్రాద్ధాదులవలన పితృదేవతలు సంతోషించుట. *

అయ్యా, యీ కలికాల మహిమవలన కొందఱు పుత్రులు మాతా పితరులను సదా దూషింపుచు వారుమృతులైనవెనుక వారికి సకాలములయందు శ్రాద్ధములఁజేయక మా తల్లిదండ్రులు తినవచ్చినారా, పురోహిత బ్రాహ్మణులకొఱకు యీ శ్రాద్ధను లేర్పడినవనే అభిప్రాయము గలవారలగుచున్నారు.

శ్లో॥ పున్నామ్నో నరకద్యస్మాత్ త్రాయతే సుతః । తస్మాత్పుత్ర ఇతిప్రోక్తస్స్వయమేవ స్వయంభువా॥ అనఁగా పుత్రుఁడు పుట్టుటచేత తండ్రికి సద్గతి నిచ్చుచున్నాఁడుగదా? పుత్రుఁడుపుట్టుట

చేత తండ్రియొక్క దుఃఖము నివర్తించును. ధర్మ ప్రజా సంతతి పరంపరను తనతో పోనియ్యక పెంచినదగుటచే తండ్రికి దుఃఖనివృత్తి యగును.

శ్లో॥ జీవతో వాక్యకరణాత్ ప్రత్యబ్దంభూరిభోజనాత్। గయాయాం పిండదానాచ్ఛ త్రిభిః పుత్రస్య పుత్రతా ॥ నాస్తిమాతృసమం నాస్తిపితృసమోగురుః । తయోర్నిత్యం ప్రియం కుర్యాత్కర్మణా మనసాగిరా ॥ అయ్యా, తల్లితో సమానమైన దైవమును, తండ్రితో సమానమైన గురువును లేరు. ఎల్లప్పుడు మనోవాక్కాయములనెడు త్రికరణ శుద్ధిగా వారికిఁ బ్రియముగా నడుచుకొనుచు వారిని సేవింపుచుండుటయే పుత్రలక్షణము. శ్లో॥ భూప్రదక్షిణషట్కేన కాశీయాత్రాయుతేనచ । సేతుస్నానశతైర్యచ్ఛ తత్ఫలం మాతృవందనే ॥

తా॥ భూమండలమంతయు నాఱునూఱులు తిఱుగుటచేతను, పదివేలమార్లు కాశీక్షేత్రమునకు పోవుటచేతను, నూరుపర్యాయములు సేతుస్నానము చేయుటచేతను యెంతపుణ్యముగల్గునో అంతపుణ్యము సూక్ష్మముగ కలుగును. ఎట్లనఁగా- తనతల్లిగారికి ఒకతూరి ప్రదక్షిణముజేసి భక్తితో నమస్కరించిన ఆఫలము తప్పకకలుగును.

శ్లో॥ అపుత్రస్యగతిర్నాస్తి స్వర్గోనైవచనైవచ। తస్మాత్పుత్రిముఖందృష్ట్వా భవేత్పశ్చాద్ధితాపసః ॥

తా॥ పుత్రసంతానము లేనివానికి స్వర్గాది భోగములు లేవు. కనుక పుత్రసంతానము కలిగినవెనుకనే తండ్రి సన్యసించితపస్సుజేయవలెను. ఈవిషయమై అనేక ప్రమాణములుగలవు. గ్రంథవిస్తరభీతిచే వ్రాయనైతిని. పుత్రుఁడైనవాఁడు తల్లి దండ్రుల వద్దనుండి సమస్తమైన ఉపచారములు చేయుచు పిదప వారుగతించినచో వారికి సకాలములయందు దహనాది కర్మలు మొదలగునవిజఱిపి తన శక్తికొలఁది దానధర్మములఁ జేయుచురావలెను. పిదప ప్రతిమాసమందును జఱుపు మాసికాది శ్రాద్ధములొనర్చి సంవత్సరవిమోక శ్రాద్ధము, ఆబ్దికశ్రాద్ధము వఱకును వారివారి కులాచార ప్రకారముగాజఱుపుచు రావలెను. పితృస్థానంబునకిచ్చిన ఆమముగాని, అన్నముగాని పిత్రాదులు దేవరూపులై యుండిరేని మంత్రబలముచేత వారికి చెందుచున్న

వని శాస్త్రములు జెప్పుచున్నవి. అట్లుగాక వారు గంధర్వులై జన్మిం చియుంటే భోగ్యరూపమైచెందును, పశువులై జన్మించితే తృణ రూపమైచెందును. సర్పజన్మమెత్తితే వాయురూపమై యాహారమ గును. రాక్షసాది జన్మమెత్తితే అది మాంసరూపమగును. లేక ప్రేతరూపులైతే రక్తమై తృప్తిగలుగును. లేక మనుష్య జన్మము సంభవించితే అన్నాదిరూపముచే జీవుఁడు సంతోషించును. ఆకార ణముచేతనే పూర్వులు బంధువులను జ్ఞాతులను బిలచి వారి కందఱికి భోజనములు పెట్టుటకలదు. ఇప్పటికిని ఈయాచారము లోకమందు జఱుగుచునేయున్నది. ఈ విషయమై యనేక ప్రమాణములుగలవు వాని నన్నిటిని ఈ గ్రంథమందు చేర్చనైతిని. శ్రాద్ధదర్పణే విశే షః ॥ శ్లో॥ తస్యతే పితరశ్శ్రుత్వా శ్రాద్ధకాల ముపస్థితం। అన్యోన్యం మనసా ధ్యాత్వా సంపతంతి మనోజనాః । తైర్బ్రాహ్మణైస్సహా శ్నంతి పితరో వాయురూపిణః ॥

తా॥ పితృదేవతలు శ్రాద్ధకాలమురాగానే మనస్సుచే నన్యో న్యము ధ్యానించి యందఱు వాయురూపముచే మనోవేగమున వచ్చి యావాహనముచేసిన బ్రాహ్మణులతో శ్రాద్ధమందు భుజింతురని శా స్త్రములు చెప్పుచున్నవి గనుకనే శ్రీరామచంద్రమూర్తి శ్రాద్ధముఁ జేయునప్పుడు సీతాదేవి బ్రాహ్మణులయందు దశరథాదులదు జూచె నని కథ వినఁబడుచున్నది. మఱియు కలియుగమునందు శాపము సంభవించినందున పితృదేవతలు దృశ్యముకానేరరు.

శ్లో॥ ప్రావృష్యంతే యమః ప్రేతాన్ పితౄంశ్చాపి యమాల యాత్ । విసర్జయతి భూలోకం కృత్వా శూన్యం స్వకం పురం ॥ తే ఘ్నతా దే॥ ప్రకాంక్షంతి పాయసం మధుసంయుతం । కన్యాగతే సవి తరి పితరో యాంతివై సుతాన్ ॥ అమావాస్యా దినే ప్రాప్తే గృహ ద్వారం సమాశ్రితాః । శ్రాద్ధాభావే స్వభవనం శాపందత్వా వ్రజం తితే ॥ అతో మూలైః ఫలైర్వాపి తథా ప్యుదకతర్పణైః పితృ తృ ప్తిం పరికుర్వీతనైవ శ్రాద్ధం విసర్జయేత్ ॥

తా॥ వర్షాకాలము తుదిని యముఁడు ప్రేతలను పితృదేవత ను దనపురమునుండి భూలోకమునకు బంపును. అప్పుడు వారు

పుత్రాదులిచ్చు పాయస మధువులఁగ్రోలి సూర్యుఁడు కన్యయందు ప్రవేశించినది మొదలు పుత్రుల గృహద్వారము నాశ్రయించి అమావాస్యలోగా శ్రాద్ధము జరుగనిచో శపించి వెళ్ళిపోదురు. గనుక తనశక్తి కొలఁది మూలములు ఫలములు మొదలగువానిచే నయినను, జలతర్పణములచేనయినను వారికిఁ దృప్తిచేయవలెననియున్నది. ఇంతియేకాదు. బ్రహ్మ మొదలుగ తృణము పర్యంతం భూతములకుఁదృప్తియగునని జెప్పఁబడుచున్నది ఎట్లనిన పిశాచాది స్వరూపులకు వికిరాన్నముచేతను తృప్తి. వృక్షాది రూపములకు స్నాన వస్త్రోదకాదులచేతను, మఱి కొందఱికి ఉచ్ఛిష్టపిండాదికముచేతను పితరును తృప్తులగుచున్నారు.

ప్రాచీనగ్రంథే॥ శ్లో॥ అగ్నిహోత్రేణ దేవస్థాః స్వర్గస్థా విప్రభోజనే। యమస్థాః పిండదానేన వికిరం నరకం తథా। దక్షిణామర్త్యలోకేషు అసురాభూరి భోజనాత్ ॥

తా॥ పితృదేవతలు దేవలోకమునందుండునప్పుడు అగ్నిహోత్రముచేతను, అట్లుగాక పితృదేవతలు స్వర్గమందుండునప్పుడు బ్రాహ్మణ భోజనము పెట్టుటచేతను పితరులు యమలోకమందు నప్పుడు పిండ ప్రదానముచేతను, నరకమందుండు నప్పుడు వికిరముచేతను, మర్త్యలోకమందు దక్షిణచేతను, రాక్షసజన్మమందు భూరిభోజనము పెట్టుటచేతను, పితృచేవతలు సంతోషింపుచున్నారు. వారుసంతోషించుటచే కర్తయొక్కవంశము క్రమముగా వృద్ధిబొందును.

శ్లో॥ మృతాహంతు పరిత్యజ్య చండాలః కోటిజన్మసు ॥

తా॥ తల్లిదండ్రుల మృతతిథులు పరిత్యజించినవానికి కోటిజన్మములెత్తినప్పటికిని వానికి చండాలత్వము పోనేరదని శాస్త్రములు ఘోషింపుచున్నవి, పితృకర్మలను జేయుటకు సమ్మతించక దురాత్ముడై యుండెనేని యనేక జన్మంబులయందు మాలవాఁడై పుట్టునని విష్ణుపురాణము జెప్పుచున్నది. పితృదేవతాతృప్తి విచారసమాప్తః.

* అథ పంచగవ్య ప్రాశనమ్.

పరాశర॥ శ్లో॥ గోమూత్రం గోమయంక్షీర దధిసర్పి కుశోదకమ్। నిర్దిష్టం పంచగవ్యంతు పవిత్రం పాపశోధనమ్ ॥ గోమూత్రం

కృష్ణవర్ణాయా శ్వేతాయాశ్చైవ గోమయమ్ । పయశ్చ తామ్ర వర్ణాయా రక్తాయా గృహ్యాతేదధి ॥ కపిలాయా ఘృతం గ్రాహ్యం సర్వం కపిలమేవవా। మూత్రమేక ఫలందద్యా దంగుష్ఠార్ధంతు గోమయం ॥ క్షీరం సప్తఫలందద్యా ద్దధిత్రిఫల మిష్యతే । ఘృతమేకఫలం దద్యా త్ఫలమేకం కుశోదకమ్ ॥

వృద్ధపరాశరః ॥ శ్లో॥ గోమూత్రం మాషకాణ్యష్టౌ గోమయస్యతు షోడశ । క్షీరస్య ద్వాదశప్రోక్తా దధ్నస్తు దశకీర్తితాః ॥ గోమూత్ర వద్ఘృతస్యాష్టౌ తదర్ధంతు కుశోదకమ్ ॥ ఏతదశక్త బాలాది విషయం ద్రష్టవ్యమ్ ॥ మాషప్రమాణం పూర్వముక్తమ్ ॥ పంచగవ్య మృతాపూతం స్థాపయేద్ద్విజసన్నిధౌ । గోమూత్రం స్థాపయేత్పూర్వే గోమయం దక్షిణేన్యసేత్ । క్షీరంతు పశ్చిమేస్థాప్యం దధిచైవోత్తరేణతు । ఘృతసా తం తథాగ్నేయ్యా మైశాన్యాంతు కుశోదకమ్ ॥ స్థాప్యపశ్చా దేకపాత్రే తన్మంత్రైస్తానియోజయేత్ । బ్రహ్మకూర్చో దహేత్సర్వం ప్రదీప్తాగ్నిరి వేంధనమ్ ॥ పవిత్రం త్రిషు లోకేషు దేవతాభిరధిష్ఠితమ్ ॥ ప్రయోగః ॥ ఏవం... ర్థం మమ సమస్తపాపక్షయార్థం శరీరశుద్ధ్యర్థం పంచగవ్య ప్రాశనాఖ్యంకర్మకరిష్యమాణః... పుణ్యాహవాచనం కరిష్యే ॥ ఆదౌ గణాధిపతి పూజాం కరిష్యే ॥ అథ గణాధిపతిపూజాం పుణ్యాహవాచనంకృత్వా ॥ నారాయణేతి మంత్రేణ పంచగవ్యం నిధాయ ॥ గోమూత్రం గోమయం క్షీరం దధిసర్పిః కుశోదకం ॥ అత్రినారాయణేతి మంత్రేణ షోడశోపచారైరభ్యర్చ్య॥ కూర్చం కృత్వా ॥ ఏకస్మిన్ పాత్రే పంచగవ్యమేళనం కృత్వా ॥ అథ ప్రాశనం కరిష్యామీతి సంకల్ప్య॥ శ్లో॥ యత్త్వగస్థిగతంపాపం దేహేతిష్ఠతిమామకే। ప్రాశనం పంచగవ్యస్య దహత్యగ్నిరి వేంధనమ్ ॥ ఆచమ్య ॥ సూర్యావలోకనం కుర్యాత్ ॥ తతః గోదానాది బ్రాహ్మణేభ్యో దద్యాత్ ॥ పంచగవ్య ప్రాశనం విప్రద్వారా కార్యమ్ ॥ స్వయంతూష్ణీం పిబేత్॥ తతః విష్ణుతీర్థప్రాశనమ్॥ శ్లో॥ ఓం నమోవాసుదేవాయ నమస్సంకర్షణాయచ । ప్రద్యుమ్నాయానిరుద్ధాయ శ్రీధరాయచ విష్ణవే । శ్రీ విష్ణవేనమః ॥ శోధ జలం పిబేత్ ॥ ఇతి పంచగవ్య ప్రాశనవిధి స్సమాప్తః.

# ఆశౌచధర్మశాస్త్రమ్.

* ముందు రజస్వలాశౌచము వ్రాయుచున్నాను. *

స్త్రీలకు రజోదర్శనమైన దినము మొదలు ౪ వర్ణములవారికి మూఁడుదినములాశౌచము. నాలుగవదినమునందు స్నానముజేసి ఐదవ దినంబున గృహకృత్యములుచేయుట కుపయోగమగును.

రజోదర్శనమైన దినము మొదలు ౧౭ దినములలోఁగా తిరిగి రజోదర్శనమయ్యేనేని స్నానము. ౧౮ వ దినమునందైతే ౧దినము. ౧౯ వ దినమునందైతే ౨ దినములు. ఆ పైన తిరిగి రజోదర్శనమయ్యేనేని 3 దినములు.

ద్రావిడాచార మెట్లనిన; ఆఁడుదానికి రజోదర్శనమైన దినము మొదలు 3నములు ఆశౌచము. రజోదర్శనమైనది మొదలు ౧౨ దినములలో తిరిగిరజోదర్శనమయ్యేనేని మూత్రమునందువలెనే శౌచమున శుద్ధియగును. ౧౮ దినముల వఱకు స్నానము. ఆపైని ఆశౌచము మూఁడుదినములు.

* జాతాశౌచ ప్రకరణము. *

జాతాశౌచము- స్రావము, పాతము, ప్రసూతియని మూఁడు విధములు. స్రావమనఁగా గర్భధారణమయినది మొదలు ౪ మాసములలోఁగా గర్భలోనిది చెడి పైకి నీరుగా కారుట.

స్రావము- మృదుస్రావము, కఠినస్రావమని రెండువిధములు. పాతమనఁగా ౫ వ నెలలోను, ౬ వ నెలలోను గర్భములోనిపిండము చెడిపోవుట, ౭ వ నెలమొదలు ప్రసూతి. అనఁగా ప్రసవము.

* మృదుస్రావాశౌచము. *

అందు తండ్రికి స్నానము- జ్ఞాతులకు స్నానమైన నక్కఱలేదు. తల్లికి మూఁడుమాసములలోఁగా 3 దినములు- నాలుగవ మాసమున నాలుగు దినములు ఆశౌచము.

* కఠినస్రావాశౌచము. *

తండ్రికి 3 దినములాశౌచము- సోదరులకు జ్ఞాతులకుస్నానం.

### * పాతాశౌచము. *

తండ్రికి అశౌచము 3 దినములు- జ్ఞాతులకు 3 దినములు- తల్లికి ఐదవమాసమున ౫ దినములు- ఆఱవమాసమున ౬ దినములు. (ప్రాచీనమడశీతిలో మృదుస్రావమునకును, కఠినస్రావమునకును వివేచనములేకయే తండ్రికిని జ్ఞాతులకును 3 దినములు పురుడు చెప్పఁబడి ది.

### * ప్రసవాశౌచము. *

మాతామహుని యింటిలో పిల్ల పుట్టినయెడల మాతామహి మాతామహులకు 3 దినములు పురుడు- తల్లి సోదరుల కొక్కదినము భర్తయింట పిల్ల పుట్టినయెడల మాతామహులకు పురుడులేదు- ఒక్క మగపిల్లయైనను ఒక్కమాఱిద్దరు మగపిల్లలైనను పుట్టినయెడల తల్లికి ౨౦ దినములు పురుడు- ఒక్కమాఱు పుట్టినయిద్దఱనఁగా నవలవారు (సంస్కృ) యమళులు ॥ ... (పిల్లచనిపోయి పుట్టినను, బొడ్డుకోయఁబడినతరువాత పదిదినములలోపున చనిపోయినను దలిదండ్రులకును. జ్ఞాతులకును ౧౦ దినములు పురుడుతప్పదు. మైలలేదు బొడ్డుకోయకమునుపు పిల్ల చనిపోయినను తల్లికి ౧౦ దినములు తండ్రికిని జ్ఞాతులకును మూఁడుదినములు పురుడు మైలలేదు. (ఆంధ్రాచారము) బొడ్డు కోయకమునుపు శిశువు చనిపోయినయెడల తల్లితోపాటు తండ్రి మొదలగు జ్ఞాతులు ౧౦ దినములు పురుడు పట్టుదురు. సమానోదకులకు త్రిపురుషులవఱకు 3 దినములు. జ్ఞాతులనఁగా కూటస్థుఁడు మొదలు ౭ పురుషులవఱకు నుండువారు సమానోదకులనఁగా ౮వ పురుషుఁడు మొదలు ౧౪వ పురుషుఁడు వఱకు నుండువారు. (ద్రావిడాచారము) కాశ్యపః ॥ శ్లో॥ రాత్రింభాగత్రయంకృత్వా ద్వౌభాగౌ పూర్వవాసరే। ఉత్తరార్థం పరదినే మృతౌతుమృతసూతయోః॥

తా॥ రాత్రియందు రజోదర్శనము, జాతము, మృతము సంభవించినయెడల ఆరాత్రికాలమును 3 వంతులు చేయవలయును మొదటి రెండువంతుల కాలములోను రజోదర్శనాదులు సంభవించిన యెడల పూర్వదినము. మూఁడవ వంతులో సంభవించెనేని పరదినమని చెప్పదగును.

## * మృతాశౌచము. *

పరదిములు వెళ్ళిన పిమ్మట నామకరణము జేయక మునుపు శిశువు మరణించెనేని సపిండులు స్నానముచేతనే పరిశుద్ధులగుదురు. తల్లిదండ్రులకు 3 రాత్రులాశౌచము. కన్యకయైతే ఒక్క దినము. నామకరణమునకు ముందు ఖననమేగాని ఉదక దానాదికము లేదు. నామకరణము చేసినపిమ్మట సంవత్సరమువఱకు దాహఖననములలో నేదైన చేయవచ్చును.

నామకరణానంతరం దంతోత్పత్తికి ముందు పుత్రమరణము కలిగితే దహనముచేసిరేని సపిండుల కొకదినమాశౌచము ఖనన పక్షమునందు స్నానముచేతనే పరిశుద్ధి. తల్లిదండ్రులకు దహన ఖననముల రెంటియందును మూఁడు దినములు కన్యా మరణమునందు త్రిపురుష సపిండులకు దహన ఖననముల రెంటియందును స్నానముచేత శుద్ధికలుగును. తల్లిదండ్రులకు ఒకదినమాశౌచము దంతోత్పత్త్యనంతరం పుత్రమరణము గలిగినేని దహన ఖననములయందు సపిండుల కొకదినమాశౌచము. తల్లిదండ్రులకు మూఁడు రాత్రులు, కన్యకయైతే త్రిపురుష సపిండులకు స్నానముచేతనే శుద్ధి తల్లి దండ్రులకు మూఁడు దినములు. మొదటి సంవత్సరమునందు కృతచూడుఁడగు పుత్రుఁడు మరణించెనేని పిత్రాది సపిండులకు మూఁడు దినములు దాహము నియతము మూఁడుసంవత్సరములు వెళ్ళినపిమ్మట చూడాకర్మయైనను కాకున్నను ఉపనయనమునకు ముందు మరణముకలిగినేని పిత్రాది సపిండులకు మూఁడుదినము లాశౌచము. దాహము నియతముగ చేయవలయును, ఉదకదానాదికము మంత్రరహితముగ చేయవలయును చూడాకర్మయైనవానికి మంత్రరహితముగ పిండదానము చేయవలెను.

కన్యకకు మూఁడుసంవత్సరములైన పిమ్మట వాగ్దానమగుటకు ముందు మరణము కలిగినేని త్రిపురుషసపిండుల కొకదినము- తల్లిదండ్రులకు మూఁడుదినములు- దాహోదక దానాదులు మంత్ర రహితముగ జేయవలెను. ... ... వాగ్దానానంతరమందు వివాహ మగుటకు ముందు కన్యలు మరణించిరేని భర్తృకుల పితృకులములయందలి సప్త

పురుష సపిండులకును పిత్రాదులకును అందఱకును 3 దినములు- దాహోదక దానాదికమును మంత్రరహితముగ జేయవలయును.

ఉపనయనమైనపిమ్మట మరణించిన పురుషునకు బ్రాహ్మణులలో పదిదినములాశౌచము- క్షత్రియులకు ౧౨ దినము లాసౌచము వైశ్యులకు పదునైదుదినములు- శూద్రులకు ఉపనయనము లేదు- స్త్రీశూద్రయోస్తు వివాహస్యోపనయన స్థానాపన్నత్వేన వివాహోత్తరమే వాశౌచాధికారః ॥ స్త్రీశూద్రులకు వివాహ ఉపనయనస్థానము నందుంచబడినదికనుక వివాహానంతరమే పూర్ణాశౌచము- ఈపూర్ణాశౌచము రెండువిధములు- శూద్రాణాం మాసం. సచ్ఛూద్రాణాం మాసార్థం ( అనఁగా శూద్రులకు 30 దినములు, సచ్ఛూద్రులకు ౧౫ దినములు) సోదకులకు మూఁడు దినములు, గోత్రజులకు స్నానము వలన శుద్ధి కలుగును.

* పి తృ గృ హ ము న ం దు క న్యా మృ తి . *

వివాహాంతరమందు కన్య పితృగృహమందు మృతిఁ బొందిన యెడల తల్లిదండ్రులకు సోదర భ్రాతలకు 3 దినములు- పిన తండ్రి మొదలగువారి కొకదినము- అట్లుగాక భర్తృగృహమందు మరణము సంభవించినప్పటికిని తల్లిదండ్రులకు 3 దినములు ఆశౌచముతప్పదు.

* మా తా పి తృ మృ తి . *

తల్లిదండ్రులయొక్క మరణమునందు వివాహితులగు పుత్రికలకు పదిదినముల వఱకును మూఁడుదినములాశౌచము- దశాహానంతరమందు సంవత్సరము వఱకును పక్షిణ్యాశౌచము- " అత్రైవ అతిక్రాంతాశౌచం బ్రాహ్మణ వచనాద్భవతి నాన్యత్ర" అనఁగా యిక్కడనే అతిక్రాంతాశౌచము బ్రాహ్మణ వచనమువలన కలుగుచున్నది గాని మఱియొక స్థలమునందు లేదని యెఱుఁగవలయును.

♦ భ్రా తృ భ గి నీ ల మృ తి . ♦

భ్రాతృ భగినీలయొక్క పరస్పరగృహములయందు మరణము కలుగుచుండఁగా పరస్పరమును మూఁడుదినములు, గృహాంతరమందు మరణము కలుగుచుండఁగానే పరస్పరము పక్షిణ్యాశౌచము.

◆ మేనమామ మృతి. ◆

మేనమామయొక్క మరణమునందు భగినీపుత్రునకు పక్షిణ్యాశౌచము- ఉపనయనమైన మేనమామయొక్క మరణమునందు మూడు దినములాశౌచము.

◆ మేనమామ భార్యామృతి. ◆

మేనమామ భార్యాయొక్క మరణమందు భర్తృ భగినీల యొక్క పుత్రులకు పక్షిణ్యాశౌచము.

◆ ఉపనయనమైన మేనల్లుని మృతి. ◆

ఉపనయనమైన భాగినేయునియొక్క మరణమందు మేనమామకును, మాతుల భగినికిని మూఁడుదినములు. అనుపనీతుడగు మేనమామమరణమునందు మేనల్లునికి మాతులభగినికిని పక్షిణ్యాశౌచము.

◆ మాతామహునియొక్క మరణము. ◆

మాతామహునియొక్క మరణమునందు పుత్రికా పుత్రునకు మూఁడుదినము లాశౌచము.

◆ అనుపనీతుఁడగు దౌహిత్రుని మరణము. ◆

అనుపనీతుఁడగు దౌహిత్రుని మరణమునందు మాతామహునకును మాతామహికిని పక్షిణ్యాశౌచము- ఉపవీత దౌహిత్రిమరణమునందు మూఁడుదినములని కొందఱు చెప్పుచున్నారు.

◆ మాతామహియొక్క మరణము. ◆

మాతామహి మరణమందు దౌహిత్రునకు పక్షిణ్యాశౌచము.

◆ భార్యయొక్క తల్లిదండ్రుల మరణము. ◆

భార్యయొక్క తల్లిదండ్రుల మరణమునందు జామాత సన్నిధియందున్నయెడల 3 దినములు- అసన్నిధియందు పక్షిణ్యాశౌచము- గ్రామాంతరమందైనయెడల యొకరాత్రి యాశౌచము.

◆ అల్లుడి మృతి. ◆

అల్లుఁడు మృతుఁడైన అత్తమామలకు స్నానమువలన శుద్ధి కలుగును- ఒక్కదినమాశౌచమని కొందరు చెప్పుచున్నారు.

◆ స్యాలకుడి మృతి. ◆

స్యాలకుఁడు మరణమునుబొందెనేని భగినీభర్తకునొక్కదినము స్యాలకసుత మరణమందు స్నానమువలన శుద్ధికలుగును.

◆ పితృ భగినీల మృతి. ◆

తండ్రి తోఁబుట్టువగు నాడుది మరణమునుబొందిన దగుచుండఁగా మేనల్లుడికి పక్షిణికాలమాశౌచము.

◆ పితృ మాతృ బాంధవ్యము. ◆

ఆత్మనః పితృష్వస్రు మాతృష్వస్రు మాతులపుత్రాః ఆత్మ బాంధవాః । పితుః పితృష్వస్రు మాతృష్వస్రు మాతులపుత్రాః పితృ బాంధవాః । మాతుః మాతృష్వస్రు పితృష్వస్రు మాతుల పుత్రాః మాతృబాంధవాః । ఏతే త్రివిధా బాంధవాః ॥ బంధుత్రయే ష్వేతేషు మృతేషు పక్షిణి । పితృష్వస్రాది కన్యానా మూఢానాం మరణే ఏకాహః । దత్తక మృతౌతు పూర్వాపరపిత్రో స్త్రిరాత్రం । సపిండానా మేకాహః ॥

తా॥ పితృష్వస్రు మాతృష్వస్రు మాతులపుత్రులు ఆత్మబంధువులు- తండ్రియొక్క పితృష్వస్రు మాతృష్వస్రు మాతుల పుత్రులు పితృబంధువులు- తల్లియొక్క మాతృష్వస్రు పితృష్వస్రు మాతుల పుత్రులు మాతృబంధువులు- ఈ మూఁడువిధములగు బంధువులును మరణమును బొందినప్పుడు పక్షిణ్యాశౌచము. పితృష్వస్రాదుల యొక్క కన్యకలు వివాహమైన పిమ్మట మరణమునుబొందిరేని యొక దినమాశౌచము దత్తకునిమరణమునందు పూర్వాపరులగు తలిదండ్రులకు మూఁడుదినము లాశౌచం. సపిండుల కొక్కదినము.

◆ జనక తలిదండ్రుల మరణము. ◆

పూర్వాపరులగు తల్లి దండ్రులయొక్క మరణమునందు దత్తకునకు మూఁడుదినము లాశౌచము. దత్తకునియొక్క పుత్రపౌత్రాదుల మరణమందును, జననమందును సపిండుల కొకదినము.

◆ దత్తకుడి మృతి. ◆

దత్తత జరిగిన తరువాత మరణముబొందెనేని దత్తతవంశము నందు సపిండులకు వారివారి వర్ణాచార ప్రకారము పూర్ణాశౌచము.

◆ ఆచార్యమరణము. ◆

ఆచార్య మరణమునందు శిష్యునకు 3 దినములు, తత్పుత్రి పత్నులయొక్క మృతియందొకదినము- ఉపనయనమును జేసి వేదమును జెప్పినవాఁడు ఆచార్యుఁడనఁబడును. వేదమునందు కొంత భాగమును జెప్పినవాఁడు ఉపాధ్యాయుఁడనఁబడును. అట్టి యుపాధ్యాయుని మరణమునందు శిష్యున కొకదిన మాశౌచము. ఉపవీతుఁడయిన శిష్యుని యొక్క మరణమందు గురువునకు మూఁడు దినములాశౌచము పరులచేత నుపనీతుఁడగు శిష్యునియొక్క మరణమునందొకదిన మాశౌచము. ఏకగ్రామవాసులును, అనూచానశ్రోత్రియులును నయిన సహాధ్యాయులయొక్క మృతియందొక దినము సాంగవేదాభ్యాసియు అనూచానుఁడనఁ బడును. వేద మాత్రాధ్యాయి శ్రోత్రియుఁడనఁబడును. అధ్యయమనఁగా అర్థజ్ఞాన సహితముగ వేదమును జమవుట యని గ్రహించవలయును

వానప్రస్థులు, యతులు మరణమును బొందిరేని సపిండులకు స్నానమమాత్రము.

◆ అతిక్రాంతాశౌచము. ◆

అతిక్రాంతాశౌచములో జననము అతిక్రాంతమయ్యేని అతిక్రాంతాశౌచములేదు- తండ్రికిస్నానముమాత్రము- మరణాశౌచమునందయితే అనుపనీత మరణాదినిమిత్తక త్రిరాత్రాదుల యందును భగినీమాతులాది మరణనిమిత్తక త్రిరాత్రాదులయందును అతిక్రాంతాశౌచములేదు. మఱియుమనిన, అతిక్రాంతాశౌచము దశాహాది మృతాశౌచ విషయమేయని గ్రహింపవలయును.

* దశాహమధ్యంబునశ్రవణము. *

జనన మరణములు పదిదినములలోపలఁ దెలిసెనేని పుత్రాదులకందఱకును మిగిలిన దినములచేతనే సమాప్తియగును.

* మూఁడు దినములలోపల. *

మొదటి మూఁడుదినములలోపల సమానోదక మరణము తెలియబడెనేని సమానోదకులకు మిగిలిన దినములచేతనే శుద్ధికల్గును. త్రిరాత్రముల నతిక్రమించి పదిదినములలోపల తెలియఁ బడినప్పటికిని

ఆశౌచము లేదనియును, మఱియేమనిన- స్నానమాత్రముచేతనే శుద్ధి కలుగును. ఈ నియమమే మాతులాది త్రిరాత్రుల యందుఁగూడ తెలియవలయును

* మా తా పి తృ మ ర ణ ము . *

తల్లిదండ్రులయొక్క మరణము దూరదేశము నందైనప్పటికిని సంవత్సరకాలముకూడ అతిక్రమించినప్పటికిని విన్నదిమొదలు పుత్రునకు పదిదినములు- ఇది బ్రాహ్మణవిషయము. తక్కినవారు వారి వారి వర్ణాచారము ననుసరించి పూర్ణాశౌచము పట్టవలయును- స్త్రీ పురుషులయొక్క పరస్పరమునందు పరస్పరమును, దేశాంతరమందు సంవత్సరాంతమైనను పూర్ణముగ పదిదినములాశౌచము. సవతులకు పరస్పరమరణమందు పరస్పరంబును, దేశకాలంబుల నపేక్షింపకయే పదిదినంబులాశౌచము పూర్ణముగ నుండును. సాపత్న్య మాతృ మరణమందు సంవత్సరాంత మందుగూడ దేశాంతర మైనప్పటికిని 3 దినములు.

♦ ఔ ర స పు త్ర మ ర ణ ము ♦

ఔరస పుత్రుని మరణము సంవత్సరానంతరమందుఁ దెలిసినను తల్లిదండ్రులకు మూఁడుదినము లాశౌచము.

* ప ది ది న ము లు గ డ చి న పి మ్మ ట . *

పదిదినములు గడచినపిమ్మట బదునొకండవదినము మొదలుకొని మూఁడు మాసములవఱకును దశరాత్రాశౌచముకలవారి మరణమందు మూఁడుదినములు. ఆఱు మాసముల వఱకును పక్షిణ్యాశౌచము. తొమ్మిది మాసములవఱకును ఒకదినమాశౌచము. అటు పిమ్మట స్నానమాత్రమని వృద్ధవసిష్ఠుఁడు చెప్పెను. మూఁడు పక్షముల వఱకును మూఁడు దినములనియును, ఆఱు మాసములవఱకును పక్షిణియనియును- సంవత్సరము వఱకొక దినమనియును- అనంతర మందు స్నానమాత్రమనియును 'పరాశర మాధవీయమను గ్రంథమందు దేవలుఁడు వచించె. ఇక్కడ నిది యాపద్విషయమునుగాఁ దలఁచి వ్యవస్థను దెలిసికొనవలెను.

* జ్ఞా తి మ ర ణ ము . *

పదిదినములు గడచిన పిమ్మట దేశాంతరమందలి జ్ఞాతి మరణము తెలియఁబడినదగుచు నుండఁగా మూఁడు పక్షములవఱకును మూఁడుదినములు, అదిమొదలుకొని యాఱుమాసములవఱకును యొక దినము, అది మొదలుకొని సంవత్సరమువఱకును పగలు మృతవార్త వినఁబడేనేని ఆపగలంతయును, ఆరాత్రి వినఁబడెనేని రాత్రియంతయు ఆశౌచమని యెఱుంగవలయును సంవత్సరానంతరమందు స్నానంబువలన శుద్ధికలుగును. ఈ అతిక్రాంతాశౌచమంతయును సర్వవర్ణ సాధారణమని యెఱుంగవలయును. ఈవిషయములో దేశాంతరమందలి జ్ఞాతి మరణము తెలియఁబడినదగుచుండఁగా స్నానంబువలననే శుద్ధియని కొందఱు చెప్పుచున్నారు. ఆ మాధవో దాహృత విష్ణుస్మృతి తెలియకపోయిన దోషముచేత యిట్లు చెప్పఁబడెనని యెఱుంగవలయును. బ్రాహ్మణునకు దేశాంతరము ౨౦ యోజనముల అంతరము కలదనియు, క్షత్రియునకు ఇఱువదినాలుగు యోజనంబుల అంతరము కలదనియు, వైశ్య- శూద్రులకు ముప్పది యోజనముల యంతరంబు కలదనియు, సచ్ఛూద్రునకు అఱువదియోజనముల యంతరము కలదనియును తెలియవలయును. పక్షాంతరములు యిప్పుడు చెప్పఁబడిన పక్షంబుల ననుసరించి తెలిసికొనవలయును. ఇక్కడ నీవిధముగా నిష్కర్షను జేసికొనవలయును ఎట్లనిన- ఏవచనములు ఏకగోత్రివిషయక జననమరణాఽతి క్రాంతాశౌచ విషయంబులలో భాని భార్యాభర్తల నిఱువురచేతను సమానంబుగా అనుష్ఠింపఁదగినవని యెఱుంగవలయును. ఏవచనంబులు భగినీ మాతులాది భిన్నగోత్రాశౌచ విషయంబుతో ఆ వచనములయందు భార్యా భర్తల మధ్యయందు యేసంబంధముకలదో ఆసంబంధముచేతనే అనుష్ఠింపవలసిన దనియును- పూర్వ సంబంధముచేతను కాదనియును తెలియవలయును.

* ఆ శౌ చ స ం పా త ము . *

ఆశౌచ సంపాతము కలుగుచుండఁగా చేయఁదగిన విషయము తెలుపఁబడుచున్నది. ఎట్లనిన- దశాహాశౌచ మధ్యమందు పది

దినంబు లాచరింపఁదగిన యాశౌచముగాని, అంతకుతక్కువదినంబుల చేత నాచరింపఁదగిన యాశౌచముగాని సంప్రాప్తమయ్యేనేని మొదటి దానిచేతనే పరిశుద్ధి. తక్కిన యాశౌచంబుల నవలంబింప నక్కఱ లేదని తెలియవలయును. పదిదినముల పురుడు వచ్చియుండఁగా వేఱొక పదిదినంబుల పురుడుగాని, దానికి తక్కువ పురుడుగాని వచ్చెనేని మొదటి పురుడుచేతనే శుద్ధియగును. పురుడు వచ్చియుండఁగా పదిదినంబులకు తక్కువ మృతాశౌచంబుగాని, దశాహ మృతాశౌచంబుగాని వచ్చెనేని మృతాశౌచంబునే అవలంబింపవలెను. ఆ విషయములో సూతకము అనఁగా పురుడు మిగిలియున్నను మృతాశౌచము చేతనే పరిసమాప్తియగునని యెఱుఁగవలయును. మూఁడు దినముల చేత పరిసమాప్తిని బొందింపఁదగిన మృతాశౌచమైనను, జననాశౌచమైనను వచ్చియుండఁగా పదిదినంబులచేత పరిసమాప్తిని బొందదగిన మృతాశౌచమైనను, జననాశౌచమైనను సంప్రాప్త మయ్యేనేని పూర్వాశౌచముచేత పరిశుద్ధి కానేరదని యెఱుఁగవలయును. మృతాశౌచమునందు సమ న్యూనమగు జననాశౌచము సంప్రాప్తమయ్యేనేని పూర్వాశౌచంబుచేతనే పరిశుద్ధికలుగునని యెఱుఁగవలయును.

పురుడు అధికమైనను మృతాసౌచముచేతనే శుద్ధియని శుద్ధి వివేకకారుఁడు చెప్పెనని యెఱుంగవలయును. పూర్వాసౌచమధ్యమందు పుట్టినప్పటికి పూర్వాసౌచానంతరమందు తెలియఁబడెనేని యుత్తరకాలపుదానినే యాచరింపవలయును. పదిదినంబు లాచరింపదగిన యాసౌచంబును అవలంబించి యుండఁగా పదియవదినము యొక్క రాత్రియందు పదిదినంబు లాచరింపఁదగిన యాసౌచము సంప్రాప్తమయ్యేనేని తొలుతటి పదిదినంబులుకాక రెండుదినములు ఆ సౌచంబును అవలబింపవలయును. ఆరాత్రియును, పరదినమును అని యెఱుంగవలెను.

పదియవదినంబు యొక్క రాత్రియందలి నాల్గవ యామమందు పదిదినంబులుగల యాసౌచము సంప్రాప్త మయ్యేనేని అప్పుడు అది మొదలుకొని మూఁడుదినములు ఆసౌచముగలవాఁడగును. మూడు దినములు అట్లుగాక ఒకటి రెండుదినములు అవలంబింపఁబడిన యా

శౌచములోపల యిట్టి యాశౌచమే సంప్రాప్తమైనప్పుడు రాత్రిమాన ము మిగిలియుండెనేని పూర్వాసౌచంబుచేతనే పరిశుద్ధియగుననియును ద్వ్యహాద్యాసౌచమును అవలంబింప నక్కఱలేదనియును తెలియవల యును. రెండుమూఁడు దినంబులు అవలంబింపఁదగిన యాసౌచ మధ్యయందు ఆసౌచాంతరము తటస్థించెనేని అధికాసౌచమునకు పూర్వాసౌచంబుచేత శుద్ధిలేదని యెఱుంగవలయును. సమన్యూన ములయందు పూర్వాసౌచముచేతనే శుద్ధియని యెఱుంగవలయును. సపిండాసౌచంబుచేత మాతృ పితృ భ్రాతృలకు ఆసౌచంబు తొలగి పోదని యెఱుంగవలయును. మాతాశౌచమధ్యమందు పితాసౌ చమధ్యమందు పితాసౌచము సంప్రాప్తమయ్యెనేని పూర్వాశౌచము చేతనే శుద్ధియని యెరుంగవలయును. తండ్రికి (లేక) తండ్రియొక్క యాసౌచముచేతనే శుద్ధియని కొందఱందురు. వానియొక్క శేష పదమునకు పూర్ణ పరత్వంబు లాక్షణికార్థమని యెఱుఁగవలయును. పితాసౌచమధ్యమందు మాతృమరణము సంప్రాప్తమయ్యెనేని పిత్రా శౌచము సమాప్తినిబొందించి పక్షిణీకాల మధికముగ నాసౌచమునవ లంబింప వలసినదని యెరుఁగవలయును. ఇది పదిదినముల పిమ్మట నాచరింపదగినదని యెరుఁగవలయును పదియవ రాత్రి యందలి నాల్గవ యామమునందు మాతృమరణము సంప్రాప్తమయ్యెనేని రెండు దినములయినను, మూఁడుదినములయినను ఆసౌచము నవలంబింపవల యునేగాని పక్షిణీకాలముకాదని యెఱుంగవలయును. తల్లికి తండ్రి తోగూడ అన్వారోహణము కలిగినయెడల పక్షిణీకాలముకూడ అధిక ముగ నాసౌచము లేదనియును, పూర్వాసౌచముచేతనే శుద్ధియనియు దెలియవలెను

## * సూతకమునందు *

సూతకమునందు మృతాసౌచము సంప్రాప్త మగుచుండఁగా పిండదానమందు ప్రతిబంధములేదని యెరుఁగవలయును. మృతా సౌచమందు పురుడు సంప్రాప్తమయ్యెనేని జాతకర్మాదికమును అప్పు డైనను ఆసౌచాంతమందైనను చేయవలసినదని తెలియవలెను. తల్లికి ఆచరింపఁదగిన యధికాసౌచములోపల తండ్రికి పదునొకండవ దినము

నందు చేయవలసిన వృషోత్సర్జనాది శ్రాద్ధమును, ఆద్యాది షోడశ శ్రాద్ధములను జేసియే తీరవలెను.

* శవస్పర్శము. *

శవస్పర్శము పగలు అయ్యోనేని నక్షత్రదర్శనమైనపిమ్మటశుద్ధి యనియును, రాత్రియందయ్యోనేని సూర్యదర్శనమైన పిమ్మట శుద్ధి యనియును తెలియవలయును ఆశౌచాన్న భక్షణమును ఆశౌచ గృహవాసము నెంతకాలముకలిగియుండునో అంతవఱకును ఆశౌచము కలిగియుండునని తెలియవలయును.

* ధర్మార్థము. *

ధర్మార్థముగ అనాథ సవర్ణ శవమును వహించినను, అపరక్రియలను జేసినను, అగ్నిదానము చేసినను అనంతఫలము కలుగునని ప్రాణయామాగ్ని స్పర్శములచేతనే శుద్ధికలుగును.

ఆశౌచధర్మశాస్త్రం సమాప్తమ్.

♦♦♦ పైతృమేధికకారికలు. ♦♦♦

అత్రాదౌ శ్రాద్ధకాలే కార్యాకార్యాణి

♦ శ్రాద్ధదినే గృహాలంకారనిషేధః *

యల్లాజీయే॥ శ్లో॥ గోమయేనో పలేపంచ సర్వశ్రాద్ధే ప్రకీర్తితమ్। గృహాలంకరణం నాస్తి ఇతి శాతాతపోబ్రవీద్ ॥౧॥

తా॥ సమస్తశ్రాద్ధదినంబులయందును గోమయంబుచే భూమి నలుకవలెనుగాని ముగ్గులు మొదలగునవి పెట్టఁగూడదని శాతాతపుఁడు చెప్పెను.

♦ అథ ఉష్ణవారినిషేధః ♦

శ్లో॥ మృతేజన్మని సంక్రాంతౌ శ్రాద్ధే జన్మదినేతథా। అస్పృశ్య స్పర్శనేచైవ న స్నాయా దుష్ణవారిణా। స గోహత్యా కృతం పాపం ప్రాప్నోత్యేవ నసంశయః ॥౨॥

తా॥ మరణాశౌచమునందును, జాతాశౌచమునందును, సంక్రమణదినమందును, శ్రాద్ధదినమందును, జన్మదినమందును, తాకఁగూడనివస్తువులు తాకినప్పుడును వేడినీళ్ళస్నానము జేయఁగూడదు. అట్లు చేసినవాఁడు గోహత్యఁ జేసినంత పాపమును బొందును.

◆ అథ దేవతార్చన నిషేధః ◆

శ్లో॥ దానాధ్యయన దేవార్చా ఉపహోమ వ్రతాదికం । న కుర్యాచ్ఛ్రాద్ధ దివసే ప్రాగ్విప్రాణాం విసర్జనాత్ ॥౩॥

తా॥ శ్రాద్ధదినమందు భోక్తలు భుజింపక పూర్వము దానము అధ్యయన, దేవతాపూజ, ఉపహోమ వ్రతములు చేయఁగూడదు.

◆ అథ ఆచమనకాలాః ◆

శ్లో॥ ఆదావంతేచ పాద్యేచ విష్టరేచ విశేషతః । ఉచ్ఛిష్టే పిండదానేచ షట్సు చాచమనం స్మృతమ్ ॥౪॥

తా॥ ప్రారంభమందును, అంతమందును, పాదప్రక్షాళన మందును ఆసనమిచ్చినప్పుడును, ఉచ్ఛిష్టాన్న విసర్జనమందును, పిండప్రదానమందును ఈ ఆరుసమయములందును ఆచమనము జేయవలెను.

◆ ఆశ్వలాయనానాం గోత్రాద్యుచ్చారణ క్రమః. ◆

శ్లో॥ సపిండీకరణాత్పూర్వ మాశ్వలాయన శాఖినాం। గోత్రం బ్రూయాత్ప్రథమతః పశ్చాన్నామాదికం వదేత్ ॥౫॥

తా॥ ఆశ్వలాయనశాఖవారు సపిండీకరణము చేయక పూర్వం ముందుగా గోత్రమునుజెప్పి పిమ్మట పేరు చెప్పవలయును.

◆ అథ విష్ణ్వర్చన విధిః. ◆

దక్షః॥ శ్లో॥ యత్కించిత్పార్వణం శ్రాద్ధం తత్ర సర్వత్రచ ద్విజే । పూజయే ద్విష్ణుమిత్యేవమితి ప్రాహపితామహః ॥౬॥

తా॥ పార్వణయుక్తమైన యే శ్రాద్ధమును జేసినను బ్రాహ్మణునియందు విష్ణుమూర్తి నావాహనముఁజేసి పూజింప వలయునని బ్రహ్మ చెప్పెను

భారతే॥ శ్లో॥ యచ్ఛ్రాద్ధం పార్వణం ప్రోక్తం తచ్ఛ్రాద్ధం వైష్ణవంవినా। కృతం నశ్యతి కౌంతేయ పతితే నేక్షితంయథా ॥౭॥

తా॥ ఏశ్రాద్ధము పార్వణ సహితముగా నాచరింపఁబడునో అట్టి శ్రాద్ధము విష్ణు దైవత్యములేకుండ చేసినయెడల వర్ణభ్రష్టునిచే జూడఁబడిన శ్రాద్ధవలెనేచెడిపోవునని భారతమందుఁ జెప్పఁబడెను.

శ్లో॥ దర్శే మహాలయే తీర్థే సపిండీకరణేతథా। వ్యర్థంభవతి తచ్ఛ్రాద్ధం వాసుదేవం వినాకృతమ్ ॥౮॥

తా॥ దర్శశ్రాద్ధము, మహాలయము, తీర్థశ్రాద్ధము, సపిండీకరణము ఈ శ్రాద్ధములయందు విష్ణుస్థానము లేకుండా చేసినయెడల ఆశ్రాద్ధములు వ్యర్థమగును.

♦ పాదప్రక్షాళనే కర్తుః పశ్చిమాభిముఖత్వ నియమః. ♦

వ్యాసః॥ శ్లో॥ ప్రాతఃకాలేచ మధ్యాహ్నే సాయాహ్నే నిశి సంధ్యయోః । పశ్చిమాభిముఖశ్రాద్ధే విప్రపాదాభిషేచనమ్ ॥౯॥

తా॥ శ్రాద్ధదినమందు ప్రాతఃకాలమునందు గాని, మధ్యాహ్నమునందుగాని, సాయంకాలమందుగాని, రాత్రియందుగాని సంధ్యాకాలమందుగాని బ్రాహ్మణుల పాదప్రక్షాళనము పశ్చిమ ముఖముగా కూర్చుండి చేయవలయును అని వ్యాసుడుచెప్పెను.

♦ పాదప్రక్షాళనే కర్తృభోక్త్రో ఉపవేశనవిధిః. ♦

యల్లాజీయే । శ్లో॥ విప్రప్రక్షాళనకాలేతు దాతాభోక్తా ద్విజోత్తమః । సుఖాసీనో భవేచ్ఛ్రాద్ధే త్వన్యథా నరకం వ్రజేత్ ॥౧౦॥

తా॥ శ్రాద్ధంబునందు, పాదప్రక్షాళనము జేయునప్పుడు కర్తయు భోక్తయు కూర్చుండవలయును. లేనియెడలనరకమునుబొందును.

♦ భోక్తురాశౌచమ్ ♦

వా॥ భోక్తుస్తృతీయ నిమంత్రణ ప్రభృత్యాశౌచాభావః । తత్పూర్వమాగతం చేత్ ఆశౌచ మస్త్యేవ ॥౧౧॥

తా॥ భోక్తకు మూడవపర్యాయము నిమంత్రణమైనది మొదలాశౌచములేదు. అంతకుపూర్వము వచ్చినయెడల ఆశౌచముండును.

♦ కర్తురాశౌచమ్. ♦

వా॥ కర్తుస్తు ప్రారంభానంతర మాశౌచాభావః। తత్పూర్వం చేదాశౌచమస్త్యేవ ॥౧౨॥

తా॥ కర్తకు ప్రారంభముమొదలు ఆశౌచములేదు. ప్రారంభించకపూర్వము వచ్చినయెడల ఆశౌచముకలదు.

♦ ప్రారంభ వివరణమ్. ♦

వా॥ పాకసమాప్తిః ప్రారంభ ఇత్యేకః పక్షః । సంకల్పో ప్రారంభ ఇత్యేకఃపక్షః । పాకప్రోక్షణమారంభ ఇత్యేకఃపక్షః । తృతీయనిమంత్రణ ఇత్యేకఃపక్షః ॥ ఏతేషు పాకపరిసమాప్తిపక్షః । ఆపద్విష

యే, అశక్తవిషయశ్చ । ఇతరేషు పక్షేషు తత్తద్దేశ శిష్టాచారోను వర్తనీయః ॥ ఏతేషు చతుర్షు పక్షేషు ఆశౌచసంప్రాప్తే కర్తా సద్యః స్నాత్వా స్వయమేవ శ్రాద్ధం కుర్యాత్ । పక్వాన్నమన్యేన ఆశౌచ రహితేన పరివేషయేత్ । భోజనపాత్రస్థ మన్నం భోక్తా ప్రోక్షేత్ । కర్తా తద్భోజనపాత్రి మస్పృశన్నేవ అన్నత్యాగం కుర్యాత్ ॥౧౩॥

తా॥ వంటచేయుట పూర్తియగుట ప్రారంభమని యొక పక్షము సంకల్పముచేయుట ప్రారంభమని యొకపక్షము, వంటపదార్థము మీాద ప్రోక్షించుట ఆరంభమని యొకపక్షము, మూఁడవపర్యాయం నిమంత్రణముచేయుట ప్రారంభమని యొక పక్షము. ఈ నాలుగు విధములలో వంటచేయుట పూర్తియగుటయే ప్రారంభమనునది యాపత్తు సంభవించినప్పుడును శక్తిలేనప్పుడు చెప్పఁ తగినది మిగిలిన విధములలో ఆయా దేశములలో శిష్టులయాచారప్రకారముగా నాచరించవలయును. ఈనాలుగు పక్షములయందును ఆశౌచమురాగానే కర్త తత్కాలమందే స్నానముజేసి తానే శ్రాద్ధము పెట్టవలయును. అప్పుడు ఆశౌచములేని యితియొకనిచే పదార్థమును వడ్డించునట్లు చేయవలెను. పిమ్మట భోక్తయే పదార్థమును ప్రోక్షించవలయును. కర్త భోక్తయొక్క భోజనపాత్రిమును స్పృశింపకుండా శ్రాద్ధమునంతయు చేయవలయును.

♦ జానునిక్షేపవిధిః.

యల్లాజీయే॥ శ్లో॥ నిక్షిప్య దక్షిణంజాను దేవాన్ పరిచరేద్బుధః । భూమౌ తథాపరంజాను పిత్రూన్ పరిచరేత్సదా ॥౧౪॥

తా॥ తెలిసినట్టివాఁడు దేవతాపూజఁ జేయునప్పుడు కుడిమోకాలును, పితృపూజఁ జేయునప్పుడు యెడమ మోకాలును భూమియందు ఆనించవలయును.

♦ ఘృతపాత్రనిధానమ్. ♦

శ్లో॥ సూపేవా పరమాన్నేవా ఘృతపాత్రిం న నిక్షిపేత్ । తద్భోజ్యమాహారం ప్రాహుర్న దాతుస్స్వర్గలౌకికమ్ ॥

తా॥ నేతిదోసెన్నను పప్పుయందును, పరమాన్నమునందు నుంచగూడదు. అట్లు చేసినయెడల ఆభోజనము రాక్షసభోజనమనియు, శ్రాద్ధకర్తకు సుకృతములేదనియు చెప్పిరి.

♦ చిత్రగుప్తబలినిషేధః. ♦

శ్లో॥ దత్తేవాప్య థవాదత్తే భూమౌయోనిక్షిపేద్బలిం । తదన్నం విఫలం యాంతి నిరాశాః పితరోగతాః ॥

తా॥ త్యాగము చెప్పకపూర్వమునందుగాని, చెప్పిన పిమ్మటగాని భూమియందు చిత్రగుప్తబలినుంచినయెడల ఆయన్నము వ్యర్థమగుచున్నది. పితృదేవతలు ఆశనువదలుకొని తిరిగిపోవుచున్నారు అనఁగా శ్రాద్ధమునందు చిత్రగుప్తబలిని విడువవలయును.

♦ సువాసినీభోజనవిధిః. ♦

యల్లాజీయే॥ శ్లో॥ సువాసిన్యాం మృతాయాంతు బ్రాహ్మణైస్సహ భోజనే । సువాసినీం తతః పశ్చాద్దనుంత్రిక సాధాచ్ఛయేత్ ॥

తా॥ ముత్తైదువ మృతినొందినయెడల బ్రాహ్మణులతోఁగూడ ముత్తైదువకు భోజనము పెట్టవలయును. మంత్ర విధ్యుక్తముగా ముత్తైదులను పూజించనక్కఅలేదు.

♦ అధిశ్రవణవిధిః. ♦

శ్లో॥ అధిశ్రవణ హీనంతు శ్రాద్ధం కుర్వీత మూఢధీః । తదన్నం మాంసతుల్యంచ తద్ఘృతం సురయాసమమ్ ॥

తా॥ ఏ మూఢుఁడైనను అధిశ్రవణము లేకుండా శ్రాద్ధమున్నాచరించినయెడల ఆ యన్నము మాంసముతో సమానమనియు నెయ్యి కల్లుతో సమానమనియు చెప్పఁబడెను.

♦ పితృసూక్తనిషేధః. ♦

శ్లో॥ షోడశే మాసికేచైవ తీర్థేచైవ సపిండనే । నిత్యశ్రాద్ధోదకుంభేచ పితృసూక్తాని వర్జయేత్ ॥

తా॥ షోడశమునందును, మాసికమునందును, తీర్థశ్రాద్ధమునందును, సపిండీకరణమునందును, నిత్యశ్రాద్ధములందును, ఉదకుంభశ్రాద్ధమునందును పితృసూక్తములను విడువవలయును.

♦ పిండదూషణే. ♦

యల్లాజీయే॥ శ్లో॥ మార్జాల మూషికస్పర్శే పిండేచ ద్విదళీకృతే। పునశ్శ్రాద్ధం విధాతవ్యం తేనపాకేన తత్క్షణాత్ ॥ వాక్యం ॥ పునశ్శ్రాద్ధం నామ పునః పిండదానమిత్యర్థః ॥

తా॥ పిండములను పిల్లి యెలుక మొదలగునవి ముట్టుకొన్నను పిండము విడిపోయినను తిరిగి శ్రాద్ధము జేయవలయును. అనఁగా తిఱిగి పిండములను జేయవలయును.

♦ కర్తుః శ్రాద్ధశేషాన్న భోజనవిధిః ♦

శ్లో॥ ప్రదక్షిణమనువ్రజ్య భుంజీత పితృసేవితమ్॥ మాధవీయే॥ శ్లో॥ శ్రాద్ధం కృత్వాతు యో విప్రో నభుంక్తేతు కదాచన। దేవాహవ్యం నగృహ్ణంతి కవ్యంతు పితరస్తథా ॥

తా॥ బ్రాహ్మణులకు ప్రదక్షిణముజేసి వారిని పంపించి శ్రాద్ధశేషాన్నమును కర్త భుజించవలయును. ఏ బ్రాహ్మణుఁడైనను శ్రాద్ధమునాచరించి పితృశేషమును భుజింపకుండా విడిచెనేని దేవతలు హవ్యమును గ్రహింపరు. పితృదేవతలు కవ్యమును గ్రహింపరు. అని మాధవీయమునందు జెప్పఁబడెను.

♦ ఉపవాసే శ్రాద్ధశేషాన్న భోజననిషేధః ♦

నిర్ణయసింధౌ॥ శ్లో॥ ఉపవాసో యదానిత్య శ్శ్రాద్ధం నైమిత్తకం భవేత్। ఉపవాసం తదాకుర్యా దాఘ్రాయ పితృసేవితమ్ ॥

తా॥ నియతముగా తా నుపవాసము చేయుదినమందు శ్రాద్ధము సంభవించినయెడల శ్రాద్ధమాచరించి కణమునాఘ్రాణించి పిమ్మట నుపవాసము చేయవలయునని నిర్ణయసింధువునందు జెప్పఁబడెను.

♦ భిన్నగోత్రాణాం పితృశేషాన్నభోజన నిషేధః. ♦

శ్లో॥ పిత్రాదీనాం తథాన్యేషాం శ్రాద్ధశేషాన్న భోజనం। వ్రతినాం విధవానాంచ యతీనాంచ నిగర్హితమ్ ॥ అన్యే భిన్న గోత్రియాః వ్రతినో బ్రహ్మచారిణః ॥ సగోత్రాణాం పితృశేష భోజనానుమతిః ॥

తా॥ ఇతర గోత్రికుల శ్రాద్ధశేషాన్నమును భుజించుట బ్రహ్మచారులకు, విధవలకు, యతీశ్వరులకు నిందితమైనది.

శ్లో॥ శ్రాద్ధావశిష్టభోక్తార స్తేవై నిరయ గామినః । సగోత్రాణాం సకుల్యానాం జ్ఞాతీనాంచ నదోషకృత్ ॥ అన్యగోత్రాణాంక్వచి త్పితృశేష భోజనానుమతిః ॥

తా॥ శ్రాద్ధశేషాన్నమును భుజించినవారు నరకమును బొందుదురు సగోత్రులకు, సకుల్యులకు, జ్ఞాతులకుమాత్రం నిషేధములేదు.

శ్లో॥ శ్వశురస్య గురోర్వాపి మాతులస్య మహాత్మనః । జ్యేష్ఠభ్రాతృశ్చ పుత్రస్య బ్రహ్మనిష్ఠస్య యోగినః । ఏతేషాం శ్రాద్ధశేషాన్నం భుక్త్వా దోషో నవిద్యతే ॥

తా॥ మామ, గురువు, మేనమామ, జ్యేష్ఠుఁడు, అన్న, కుమారుఁడు, బ్రహ్మజ్ఞాని, యోగీశ్వరుఁడు యీ మొదలగు వారియొక్క పితృశేషమును భుజించినను దోషములేదు.

♦ శూద్రస్య పితృశేషాన్నదాననిషేధః. ♦

యల్లాజీయే॥ శ్లో॥ నశూద్రం భోజయేత్తస్మిన్ గృహే యత్నేన తద్దినే । శ్రాద్ధశేషం నశూద్రాయ దదాతిచ బలేష్వపి ॥ శూద్రంతు భోజయేత్వాయో దద్యాచ్ఛ్రాద్ధేషుమానవః । శ్రాద్ధ నిష్పీడితాయాంతి శ్రాద్ధం దేవాచ తత్క్షణాత్ ॥

తా॥ శ్రాద్ధదినమందు శ్రాద్ధమాచరింపఁబోవు గృహమునందు శూద్రునకు భోజనము పెట్టఁగూడదు. పితృశేషమును శూద్రునకు పెట్టఁగూడదు. మఱి యెచ్చోటనయినను తానుముందుగా శూద్రునకు భోజనము పెట్టఁగూడదు. ఇందుకు భిన్నముగా నాచరించినయెడల శ్రాద్ధము భంగమైనదానినిగా నెంచి శ్రాద్ధ దేవతలు తత్క్షణమునందే వెళ్ళిపోవుదురు.

♦ ఆశౌచమధ్యేపాప్తప్రత్యాబ్దికస్య తదనంతరం శూన్యతిథౌ నిషేధః. ♦

వసిష్ఠః శ్లో॥ ఆశౌచమధ్యే పిత్రోశ్చ భవేన్మృతతిథి స్తదా । ఆతిథిం వర్జయిత్వాంతే ప్రత్యబ్దం కారయేత్సుతః ॥

తా॥ తల్లిదండ్రుల మృతతిథులు ఆశౌచాక్రాంతములైనప్పుడు శూన్యతిథియందు శుద్ధియగునేని యాదినమువిడిచి మఱునాడు పెట్టవలయును- అని వసిష్ఠుఁడు జెప్పెను.

దక్షః॥ శ్లో॥ ఆశౌచమధ్యే పిత్రోశ్చ యథామృతతిథిర్భవేత్।
ఆశౌచాంతే శూన్యతిథౌ సకుర్వంతి తిథిం బుధాః ॥

తా॥ ఆశౌచ నడుమ తల్లిదండ్రుల మృతదినంబులు సంభవిం చినయెడల శుద్ధదినము శూన్యతిథియగునేని యాదినంబున శ్రాద్ధ మును తెలిసినవారు విసర్జింతురని దక్షుఁడు చెప్పెను

♦ శూన్యతిథ్యనంతరదినేకర్తవ్యత్వవిధిః ♦

శ్లో॥ శూన్యతిథ్యాముపోష్యైవ శ్రాద్ధం కుర్యాత్పరేహని।
కృత్వా సమ్యగ్విధానేన బంధుభిస్సహ భోజయేత్ ॥

తా॥ ఆశౌచ శుద్ధదినము శూన్యతిథి యగునేని యాదినంబున నుపవాసముండి మఱుసటిదినంబున యథావిధిగా శ్రాద్ధము నాచ రించి బంధువులతోఁగూడ భుజింపఁదగును.

♦ సూతకాంతరితశ్రాద్ధనిర్ణయః. ♦

శ్లో॥ శుచిభూతే నదాతవ్యా యాతిథి ప్రతి పద్యతే। సాతిథి స్తస్య కర్తవ్య నచాన్యంవైకదాచన ॥ ఇతి ఋష్యశృంగః ॥

తా॥ జాతాశౌచ మృతాశౌచ దివములలో ఆబ్దికము సంభ వించినయెడల శుద్ధదినమునందు ఆబ్దికము పెట్టవలయునుగాని మఱి యొక దినమునందు పెట్టఁగూడదని ఋష్యశృంగుఁడు చెప్పెను. దేశాచారము సర్వత్రా యిట్లే జఱుగుచుండెను.

♦ సంవత్సరవిమోకశ్రాద్ధవిధిః. ♦

శ్లో॥ వత్సరాంతే విమోకాఖ్యం శ్రాద్ధం పార్వణవద్భవేత్।
మృతస్య తృప్తయే కార్యం యద్యాకాశ దినేపిహా ॥ (ఆకాశ దినం నామ శూన్యతిథిః)

తా॥ మృతినొందినవాని తృప్తి నిమిత్తమై సంవత్సరాంత మందు శూన్యతిథి యైనప్పటికిని సంవత్సరవిమోకమును పార్వణసహి తముగా యథావిధిగా నాచరించవలయును.

శ్లో॥ అబ్దస్యాంతే విమోకాఖ్యం శ్రాద్ధం ప్రథమవత్సరే।
కుర్యాత్పార్వణ వచ్చైవ శ్రాద్ధహీన తిథౌ యది ॥ శ్రాద్ధహీన తిథి శ్శూన్యతిథిః ॥

తా॥ సంవత్సరాంతమునందు సంవత్సరవిమోకమును, శ్రాద్ధమును- పిమ్మట వత్సరారంభమునందు ప్రథమాబ్దికమును, శూన్య తిథి సంభవించినప్పటికిని పార్వణసహితముగా శ్రాద్ధమును యథా విధిగా నాచరింపవలయును.

శ్లో॥ మృతస్యవత్సరాంతేతు యదిశూన్యతిథిర్భవేత్ । తస్మిన్ దినే విమోకాఖ్యం కర్తవ్య మవిచారతః ॥ సంవత్సరవిమోకాఖ్యమ కృత్వా ప్రథమాబ్దికం । యచ్ఛ్రాద్ధం కురుతే మోహాత్కృతం కర్మాపి నిష్ఫలమ్ ॥

తా॥ సంవత్సరాంతమునందు శూన్యతిథి సంభవించినప్పటికిని యాదినమందు మృతినొందినవానియొక్క తృప్తికొఱకు సంవత్సర విమోకము, శ్రాద్ధము జేయవలయును. నాలోచింప నక్కఱలేదు.

స్మృతిదీపికాయాం॥ శ్లో॥ ఆశౌచాది నిమిత్తైశ్చ విమోకాఖ్య మతిక్రమేత్ । తదాయది విమోకాఖ్యం నకర్తవ్యమితీరితమ్॥

తా॥ సంవత్సరవిమోకమును శ్రాద్ధము నాచరింపక అజ్ఞానముచే ప్రథమాబ్దికమునుబెట్టినయెడల ఆచేసినకర్మ నిష్ఫలమగును.

♦ దేశాంతరగత భ్రాతౄణాం ప్రత్యాబ్దికానుమాసికా ♦
ఽమావాస్యాది విధిః.

శ్లో॥ విభక్తోవాఽవిభక్తోవా దేశాంతర గతస్సుతః । పృథ క్ఛ్రాద్ధం ప్రకుర్వీత మాతాపిత్రోర్మృతేహని॥ అవిభక్తాఽవిభక్తా వా దేశాంతరగతాయది । కర్తవ్యం తైరమావాస్యా ప్రత్యబ్ద మను మాసికమ్ ॥

గ్రంథాంతరే॥ శ్లో॥ అవిభక్తసుతాః కుర్యా ద్దేకః పిత్రోర్మృతాహికం । స్థానాంతరే పృథక్కుర్యా ద్దర్శశ్రాద్ధానుమాసికే ॥

తా॥ కుమారుఁడు విభక్తుఁడయినను, విభక్తుఁడు కాకున్నను దేశాంతరము వెళ్ళినప్పుడు తల్లితండ్రుల శ్రాద్ధదినంబులు సంభవించెనేని యాదినంబున తాను శ్రాద్ధము తప్పక నాచరింపవలయును. తనయులు విభజించుకొన్నను, విభజించుకొనకపోయినను దేశాంతరము వెళ్ళినప్పుడు ప్రత్యాబ్దికము దర్శశ్రాద్ధము అను మాసికము వేరుగా నచ్చట నాచరింపవలయును. అన్నదమ్ములు వేరు పడక

పోయినను వారిలోనొకఁడు దేశాంతరము వెళ్ళినప్పుడు తల్లిదండ్రుల శ్రాద్ధములను, అనుమాసికమును, దర్శశ్రాద్ధమును తాను ప్రత్యేకముగానైనను జేయవలయును.

శ్రాద్ధనిమంత్రితస్య గాయత్రీజపసంఖ్యా.

శ్లో॥ పత్యాబ్దే త్రిశతంచైవ మాసికే శతపంచకం । ద్విసహస్రం సపిండేచ అయుతం ప్రేతభోజనే ॥

తా॥ ప్రత్యాబ్దికమందు మూఁడువందలును, మాసికమునందు అయిదువందలును సపిండీకరణమునందు రెండువేలును, ప్రేతభోజనకాలమందు పదివేలును గాయత్రీమంత్రజపమును జేయవలయును.

ఉపనయన వివాహానంతరే శ్రాద్ధకర్తవ్యత్వ విధిః

శ్లో॥ మౌంజీబద్ధ్వావివాహశ్చ షణ్మాసంవర్షమేవవా । నకుర్యాత్పిండనిర్వాపం నదద్యాత్తుతిలోదకమ్ ॥ పుత్రీపుత్రవివాహయోశ్చ పరతషణ్మాసతోభ్యంతరే । పిత్రోరాబ్దికపైతృకేషు విధివత్ దూర్వాక్షతైరర్చయేత్ । దధ్యన్నంబదరీఫలైశ్చసహితం పిండాన్ వికీర్యాదికం । సవ్యంతిలతర్పణంచహితథా దర్భాస్తిలాన్ వర్జయేత్ ॥

తా॥ ఉపనయనమైన పిమ్మటను, వివాహమైనపిమ్మటను ఆరుమాసములవరకుగాని సంవత్సరముకరకుగాని పిండప్రదానము తిలతర్పణము చేయఁగూడదు. కుమార్తెకు కుమారులకు వివాహములు జరిగినపిమ్మట ఆరుమాసములలోపల తల్లిదండ్రుల ఆబ్దికములు సంభవించినయెడల గరికెలు అక్షతలతో శ్రాద్ధమునందు అర్చనజేయవలయును. పిండములను పెరుగు రేగిపండ్లు మొదలగువానితో మిశ్రితముజేయవలెను. వికిరాన్నము అపసవ్యము, తిలతర్పణము, తిలలు, దర్భలు మొదలగునవి విడువవలెను.

అనేక శ్రాద్ధసన్నిపాతే,

శ్లో॥ మాతాపిత్రోః క్షయేప్రాప్తే యదిదర్శసమాగతే పితృశ్రాద్ధంతుపూర్వంస్యాన్మాతృశ్రాద్ధమతఃపరం । దర్శశ్రాద్ధంతతఃపశ్చాత్తార్పణస్తు మహాలయె । దర్శేసంక్రమణేప్రాప్తే తచ్ఛ్రాద్ధతుకథంభవేత్ । అమాశ్రాద్ధంనకర్తవ్యం కర్తవ్యసంక్రమాదితః । సంక్రమేగ్రహణే దర్శేతచ్ఛ్రాద్ధంతు కథంభవేత్ । ఉపరాగప్రయుక్తంతు సనుకాలేసమాచరేత్ । దర్శేతుమాసికేప్రాప్తే మాసికం

పూర్వమాచరేత్ । దర్శప్రత్యాబ్ధికేప్రాప్తే ఆబ్దికంపూర్వమాచరేత్
నిత్యనైమిత్తికేప్రాప్తే నిత్యంనపరిలంఘయేత్ । నైమిత్తికంపురాకు
ర్యాత్తతోనిత్యం మాచరేత్ ॥

తా॥ ఒక్కదినంబున తల్లిదండ్రుల శ్రాద్ధంబులు దర్శశ్రాద్ధము మొదలగు నకేకశ్రాద్ధంబులు సంభవించినప్పుడు ముందుగ తండ్రితిథియు పిమ్మట మాతృశ్రా శ్రాద్ధమును, అనంతరము దర్శశ్రాద్ధమును పిమ్మట మహాలయశ్రాద్ధము నాచరింపవలయును. ఒక్కదినంబున దర్శసంక్రమణ శ్రాద్ధంబులు సంభవించినయెడల సంక్రమణశ్రాద్ధము నాచరింపవలయును. దర్శశ్రాద్ధముచేయనక్కరలేదు. సంక్రమణగ్రహణదర్శశ్రాద్ధంబు లొకదినంబునసంభవించినయెడల గ్రహణసంక్రమణశ్రాద్ధంబు లొకపర్యాయము నాచరింపవలయును. దర్శశ్రాద్ధము, మాసికము ఒక్కదినంబున సంభవించినయెడల ముందు మాసికముపెట్టి పిమ్మట దర్శశ్రాద్ధము నాచరింపవలయును దర్శశ్రాద్ధము ఆబ్దికము ఒక్కదినంబున సంభవించినయెడల ముందుగా నాబ్దికము పెట్టవలయును. నిత్యనైమిత్తికములు సంభవించినప్పుడు నిత్యకర్మను ఎప్పుడును విడువగూడదు. ముందుగా నైమిత్తికకర్మను జేసినపిమ్మట నిత్యకర్మను జేయవలెను

## గ్రహణే ఆశౌచన సూతకాభావః

శ్లో॥ చంద్రసూర్యగ్రహేస్నాయా త్సూతకేమృతకేతథా ।
అస్నాయీమృత్యుమాప్నోతి స్నాయీమృత్యుంనవిందతి ॥ సూతకే
మృతకేచైవ నదోషోరాహుదర్శనే । తావదేవభవేచ్ఛుద్ధి ర్యావన్ము
క్తిర్నదృశ్యతే ॥

సూర్యచంద్రగ్రహణములయందును, జాతాశౌచమృతాశౌచములయందును స్నానము జేయవలయును. అట్లుస్నానముజేయనియెడల మృత్యువునుబొందును. స్నానముచేసినయెడల మృత్యుభయముకలుగదు జాతాశౌచ మృతాశౌచదినములందు గ్రహణము సంభవించినయెడల గ్రహణవిముక్తిపర్యంత మాశౌచములేదు.

## జీవత్పితృకస్య తర్పణనిషేధః

శ్లో॥ జీవమానఃపితాయస్య మాతాయదివిపద్యతే । మాతృ
శ్రాద్ధంసుతఃకుర్యా న్నకుర్యాత్తిలతర్పణమ్ ॥

తా॥ తండ్రిజీవించియుండగ తల్లి మృతినొందినయెడల తల్లికి శ్రాద్ధకృత్యము నంతయు జేయవలయును తిలతర్పణము మాత్రము జేయనక్కరలేదు.

---

బోధాయనామావాస్యా నిర్ణయః.

శ్లో॥ భూతేహ్న్యమాయుతేయుగ్మా పక్షాదేస్సాయమేతిచేత్ బోధాయనానాంభూతేమా । శ్రాద్ధంకుర్యామితోన్యథా ॥

సౌరమాస తిథి నిర్ణయః

శ్లో॥ జన్మర్క్ష తర్క్ష మృతాన్యహాని ఇత్యేకమాసేచపునర్భవాని పునర్భవేష్వేవహికర్మకుర్యాత్ తేష్వేవసంక్రాంతియుతేషునైవ । మాస్యేకస్మిన్ ద్వితిథేచేత్పరాస్యాత్ త్వాద్యస్మిన్ త్వాసర్యసంక్రాంతియుక్తే । ద్యావప్యేతౌ సంక్రమేచేత్పరస్యత్సర్వాం చైవంచం ద్రిసూర్యోత్తరాగే ॥ వక్ష్చికాది త్రిమాసేషు మృతాహాస్సభవేద్యది పూర్వమాసేతుకర్తవ్య మితిశాతాతపోబ్రవీతు । ఊర్ధ్వంముహూర్తం కుతపా సంక్రాంతిర్యదిదృశ్యతే । పూర్వమాసేనకర్తవ్యం కుర్యాత్ప్రాక్కృతపాదపి ॥

శ్రాద్ధవిఘ్నే ఆమశ్రాద్ధవిధిః.

శ్లో॥ శ్రాద్ధవిఘ్నేద్విజాతీనా మ్మామశ్రాద్ధంప్రకీర్తితం । అమావాస్యాదినియతం మాససంవత్సరాభృతఇతి ॥ హారీతః ॥

తా॥ శ్రాద్ధమునకు విఘ్నము సంభవించినప్పుడు దర్శశ్రాద్ధము, మాసికము, ఆబ్దికము మొదలగునవి ఆమద్రవ్యములచేతనే బ్రాహ్మణులుచేయదగినవని హారీతుడుచెప్పెను. ఆమద్రవ్యమనగా భోజనసామాగ్రి.

మరీచిః ॥ శ్లో॥ అనగ్నికఃప్రవాసీచ యస్యభార్యారజస్వలా। ఆమశ్రాద్ధంద్విజఃకుర్యా స్నతుకుర్యాన్మృతేహని ॥

తా॥ అహితాగ్నికానివాఁడును, ప్రయాణమైనవాఁడును బహిష్టయినదాని పెనిమిటియు మృతదినమునందు ఆమశ్రాద్ధమునే జేయవలెను.

లోగాక్షిరపి॥ శ్లో॥ పుష్పవత్స్యపిదారేషు విదేశస్థాప్యనగ్నికః । అన్నేనైవాబ్దికంకుర్యా ద్ధేమ్నావామేనవాక్వచిత్ ॥

తా॥ భార్యబహిష్ఠురాలైనను, పరదేశమునందుండినను భార్యాగ్నికానివాఁడైనను అన్నశ్రాద్ధమునే జేయవలయును. ఆదిసంభవముకాని పక్షమునందు హిరణ్యశ్రాద్ధమును జేయవలయును ఆదిసంభవము గాని పక్షమున ఆమశ్రాద్ధమయినను జేయవలయును.

అపుత్రాయాః రజస్వలాయాః భర్తృశ్రాద్ధవిధిః

శ్లో॥ అపుత్రాతుయదాభార్యా సంప్రాప్తే భర్తృరాబ్దికే రజస్వలాభవేత్సాతు కుర్యాత్తత్పంచమేహని ॥

తా॥ సంతానములేనట్టి స్త్రీ బహిష్టయియుండగా అట్టిసమయమున పెనిమిటి యాబ్దికము సంభవించినయెడల అయిదవస్నానదినంబున ఆబ్దికము పెట్టవలయును.

ప్రభాసఖండే॥ శ్లో॥ విశుద్ధస్యాచ్చతుర్థేహ్ని స్నానాన్నారీరజస్వలా। దైవేకర్మణిపిత్రేచ పంచమేహనిశుధ్యతి ॥

తా॥ బహిష్ఠయిన స్త్రీ నాల్గవదినమున స్నానముజేసిన శుద్ధియగును గాని దేవపితృకార్యము విషయమయి అయిదవదినమందు శుద్ధిగలదియగునని ప్రాభాసఖండమునందు జెప్పబడెను.

పాదప్రక్షాళన విధి.

శ్లో॥ మండలాత్పశ్చిమేభాగే బహిరేవస్థితోద్విజః । తత్రైవ నిస్సృజేత్పాద్యం క్షాళనంమండలోపరి । ఉదఙ్ముఖోపవిష్టానాం పాదానాంక్షాళసంభవేత్ । అన్యథాక్షాళనే శ్రాద్ధే నిరాశాఃపితరోగతాః ॥

తా॥ మండలమునకు పడమటిభాగమున పాదములనుంచి పాద్యమును విడువవలయును. పాదప్రక్షాళనము పాదములను మండలముమీదనుంచిన పిమ్మట జేయవలయును. బ్రాహ్మణుల నుత్తరముఖముగ గూర్చుండబెట్టి పాదప్రక్షాళనము జేయవలయును. లేనియెడల పితృదేవతలు ఆశారహితులై వెళ్ళుదురు.

శ్లో॥ పాదమూలేపితృస్థానం పాదమధ్యేపితామహః । ప్రపితామహస్తుపాదాగ్రే పాదాప్రక్షాళయేత్క్రమాత్ ॥

తా॥ పాదముల మొదట పితృలును పాదములమధ్య పితామహులును, పాదములచివర ప్రపితామహులు నుందురుకాబట్టి క్రమముగా పాదములను ప్రక్షాళనజేయవలయును.

పాదప్రక్షాళనోదకమార్జన విధిః

శ్లో॥ దేవపాదోదకం స్నానం స్పర్శనంపితృమండలే । ఉభయోస్నానమాప్నోతి పునఃకర్తావిధీయతే । పితృబ్రాహ్మణ పాదాంబు నధారవ శిరసేక్వచిత్ ॥

తా॥ విశ్వదేవులయొక్క పాదోదకమునుపైన మార్జనముచేసికొనుటయు పితృస్థానముయొక్క మండలమును స్పృశించుటయును కర్తకు స్నానముతో సమానమైనవి. కాబట్టి పితృస్థానమందు నిమంత్రితుండయిన బ్రాహ్మణుని పాదోదకమును శిరస్సున ధరింపగూడదు మండలమునుమాత్రము స్పృశింపవలయును.

## ఆ చ మ న ప్ర కా ర ః.

శ్లో॥ మండలాత్పూర్వతో దేవాః పితృవిప్రాస్తథోత్తరే । కర్తా చైవతదీశాన్యే అన్యత్రరుధిరోపమమ్ ॥

తా॥ మండలమునకు తూర్పుగా విశ్వేదేవులును, ఉత్తరమున పితృబ్రాహ్మణులును కర్త ఈశాన్యభాగమందును గూర్చుండి యాచమనము జేయవలయును. దీనికి వ్యతిరేకస్థలములయందుండి యాచమనము జేసినయెడల రక్తపానముతో సమానమగును.

శ్లో॥ కర్తురాచమనాత్పూర్వం భోక్తురాచమనకయది । శునోమూత్రసమంతోయ మిత్యేవం మనురబ్రవీత్ ॥

తా॥ కర్త యాచమనముజేయుటకంటె ముందు భోక్త యాచమనము జేసినయెడల శునకమూత్రపానముతో సమానమని మనువు చెప్పియుండెను.

## గం ధ ధా ర ణ మ్.

శ్లో॥ చందనం పితృకార్యేషు ఫాలమధ్యేవినిక్షిపేత్ । కంఠే కక్షే తథాపృష్ఠే నిరాశాః పితరోగతాః ॥

తా॥ పితృకార్యములయందు ముఖమునందే మంచిగంధమును ధరించవలయునుగాని కంఠమునందును, భుజములయందును, వీపునందును ధరించినయెడల పితృదేవతలు ఆశారహితులై వెళ్ళిపోవుదురు.

## ప రి వే ష ణ వి ధి ః.

శ్లో॥ మధ్యేఅన్నం ప్రతిష్ఠాప్య దక్షిణేఘృతపాయసే । శాకాది పురతశ్చైవ అంతేసూపస్తథైవచ ॥

తా॥ అన్నమును మధ్యప్రదేశమందును, దక్షిణభాగమునందు నేతిదొన్నెయు, పాయసముదొన్నెయు, కూరలుమొదలగునవి ముందరను పప్పు చివర నుంచవలయును.

* (కషమవిషయములు మాధర్మశాస్త్రసంగ్రహమను గ్రంథమునందు అచ్చువేయబడినది.

గ్రంథం సమాప్తమ్.

174-8

# జ్యోతిషామృతము

అను జాతకభాగము. 3-8-0

ఈ గ్రంథము కీ॥ శే॥ నాతండ్రిగారైన

చల్లాల లక్ష్మీనృసింహశాస్త్రిగారిచే

వచనకావ్యముగా వ్రాయబడినది.

సంవత్సరములు, చాంద్రమాసములు, సౌరమాసములు, అర మాసములు ఋతువులు, 6 అయనములు, 7 తిధులు, 8 నక్షత్రములు, 9 నక్షత్రముల వానివాని స్వరూపములు జంతువులు, 10 గ ములు మొదలగునవి. 11 అశ్విన్యాదిరాసులు 12 నామనక్షత్రముల 13 జీవనిర్జీవ నక్షత్రములు 14 మహాదశలుదాసులు కాలపురుషస్వభావములు, 15 రవ్యాదిగ్రహములు, 16 రవ్యాదిగ్రహస్వభావములరా చక్రములు 17 గ్రహసంచార కాలనిర్ణయము 18 లగ్నకారకత్వములు 19 కేంద్రాదిస్థానసంజ్ఞలు, 20 లగ్నముకట్టువిధము, 21 అంచక్రవిభాగము. 2 అంసచక్రము 23 ఇందులగ్నము కట్టువిధము 24 తారాలగ్నముకట్టువిధము 25 జనలగ్న తెలిసేవిధము, 26 దేశ లగ్నప్రమాణములు, 27 జన్మకాలఘడియలు తెలిసికొనుట 28 మహదశానిర్ణయములు, 29 మహాదశాశేషము, 30 అంతర్దశలు, 31 విదశాసూక్ష్మదశాలక్షణములు, అంతర్దశాటేబిల్ గ్రహములయొక్క బలాబలములు చంద్రబలము వృద్ధిక్షయములు, గ్రహమిత్రత్వ శత్రుత్వములు, ఉచ్ఛస్వక్షేత్రమూలత్రికోణములు, గ్రహకారకత్వములు తాత్కాలికశత్రుమిత్రత్వములు షడ్వర్గము; షడ్బలములు గ్రహసమయములు, గ్రహములకుఅవస్థలు, గ్రహవక్రాదులు, గ్రహచ్ఛాదనము, ఆదాగ్రహదశాఫలము, సూర్యదశ, చంద్రదశ, కుజదశ రాహుదశ, గురుదశ, శనిదశ, బుధదశ, కేతుదశ, శుక్రదశ, సూర్యునియొక్క లగ్నాదిద్వాదశస్థానఫలములు; కేవలమారకనిర్ణయస్వభావము, రవ్యాదిగ్రహములవలన జాతకుడు యేలోకమునుండి వచ్చినది మొదలగు 172 విశేషములుగల గొప్పగ్రంథము.

వలయువారు !

లక్ష్మీనరసింహ ముద్రాక్షరశాల
మచిలీపట్టణము.
18/25 బచ్చుపేట,

## ఆచమన ప్రకారః.

శ్లో॥ మండలాత్పురతో దేవాః పితృవిప్రాస్తథోత్తరే । కర్తా చైవతదీశాన్యే అన్యత్రరుధిరోపమమ్ ॥

తా॥ మండలమునకు తూర్పుగా విశ్వేదేవుండును, ఉత్తరమున పితృబ్రాహ్మణుఁడును కర్త ఈశాన్యభాగమందును గూర్చుండి యాచమనము జేయవలయును. దీనికి వ్యతిరేకస్థలములయందుండి యాచమనము జేసినయెడల రక్తపానముతో సమానమగును.

శ్లో॥ కర్తురాచమనాత్పూర్వం భోక్తురాచమనకయది । శునో మూత్రసమంతోయ మిత్యేవం మనురబ్రవీత్ ॥

తా॥ కర్త యాచమనముజేయుటకంటే ముందు భోక్త యాచమనము జేసినయెడల శునకమూత్రపానముతో సమానమని మనువు చెప్పియుండెను.

## గంధ ధారణమ్.

శ్లో॥ చందనం పితృకార్యేషు ఫాలమధ్యేవినిక్షిపేత్ । కంఠే కక్షే తథాపృష్ఠే నిరాశాః పితరోగతాః ॥

తా॥ పితృకార్యములయందు ముఖమునందే మంచిగంధమును ధరించవలయునుగాని కంఠమునందును, భుజములయందును, వీపునందును ధరించినయెడల పితృదేవతలు ఆశారహితులై వెళ్ళిపోవుదురు.

## పరివేషణవిధిః.

శ్లో॥ మధ్యేఅన్నంప్రతిష్ఠాప్య దక్షిణేఘృతపాయసే । శాకాది పురతశ్చైవ అంతేసూపస్తథైవచ ॥

తా॥ అన్నమును మధ్యప్రదేశమందును, దక్షిణభాగమునందు నేతిదొన్నెయు, పాయసముదొన్నెయు, కూరలుమొదలగునవి ముందరను పప్పు చివర నుంచవలయును.

• (కడమవిషయములు మాధర్మశాస్త్రసంగ్రహమను గ్రంథమునందు అచ్చువేయబడినది.

గ్రంథం సమాప్తమ్.

174—8

# జ్యోతిషామృతము

అను జాతకభాగము. 3-8-0

ఈ గ్రంథము కీ॥ శే॥ నాతండ్రిగారైన

చల్లా లక్ష్మీనృసింహశాస్త్రిగారిచే

వచనకావ్యముగా వ్రాయబడినది.

సంవత్సరములు, చాంద్రమాసములు, సౌరమాసములు, అధిమాసములు 5 ఋతువులు, 6 అయనములు, 7 తిధులు, 8 నక్షత్రములు, 9 నక్షత్రముల వానివాని స్వరూపములు జంతువులు, 10 గణములు మొదలగునవి. 11 అశ్విన్యాదిరాసులు 12 నామనక్షత్రములు 13 జీవనిర్జీవ నక్షత్రములు 14 మహాదశలుదాసులు కాలపురుషస్వభావములు, 15 రవ్యాదిగ్రహములు, 16 రవ్యాదిగ్రహస్వభావములరాచక్రములు 17 గ్రహసంచార కాలనిర్ణయము 18 లగ్నకారకతములు 19 కేంద్రాదిస్థానసంజ్ఞలు, 20 లగ్నముకట్టువిధము, 21 అంశచక్రవిభాగము. 2 అంశచక్రము 23 ఇందులగ్నము కట్టువిధము 24 తారాలగ్నముకట్టువిధము 25 జనలగ్న తెలిసేవిధము, 26 దేశలగ్నప్రమాణములు, 27 జన్మకాలఘడియలు తెలిసికొనుట 28 మహాదశానిర్ణయములు, 29 మహాదశాశేషము, 30 అంతర్దశలు, 31 విదశాసూక్ష్మదశాలక్షణములు, అంతర్దశాటేబిల్ గ్రహములయొక్క బలాబలములు చంద్రబలము వృద్ధిక్షయములు, గ్రహమిత్రత్వ శత్రుత్వములు, ఉచ్ఛస్వక్షేత్రమూలత్రికోణములు, గ్రహకారతత్వములు తాత్కాలికశతృమిత్రత్వములు షడ్వర్గము; షడ్బలములు గ్రహసమయములు, గ్రహములకుఅవస్థలు, గ్రహవక్రాదులు, గ్రహచ్ఛాదనము, ఆదాగ్రహదశాఫలము, సూర్యదశ, చంద్రదశ, కుజదశ రాహుదశ, గురుదశ, శనిదశ, బుధదశ, కేతుదశ, శుక్రదశ, సూర్యునియొక్క లగ్నాదిద్వాదశస్థానఫలములు; కేవలమారకనిర్ణయస్వభావము, రవ్యాదిగ్రహములవలన జాతకుడు యేలోకమునుండి వచ్చెనో మొదలగు 172 విశేషములుగల గొప్పగ్రంథము.

వలయువారు !

లక్ష్మీనరసింహ ముద్రాక్షరశాల

మచిలీపట్టణము.

18|25 బచ్చుపేట ,